కృష్ణదేవరాయ గ్రంథమాల          పుష్పము-30
హిందూపురం.

శ్రీ

# రాయలసీమ రచయితల చరిత్ర-4

సంపుటితో చేరి, 20 వ శతాబ్దపు రాయలసీమ కవి
త్నముల చరిత్రలు ఏర్చి, కూర్చి, తీర్చబడి నూట
నలువది ఒక్క రత్నహారముగా తెలుగుతల్లి
కంఠసీమ నలంకరింపబడినది.

గ్రంథకర్త :

**కవిభూషణ, కవితిలక**

**కల్లూరు అహోబలరావు**

★ Ist Edition
Copies 1000
1986 August

★ **Rayalaseema Rachayithala Charitra-4**

★ Kavi Bhushana Kavi Thilaka
KALLUR AHOBALA RAO

★ Book Publishers & Distributors
**Sri Krishna Devaraya Grandhamala**
Hindupur - 515 201

★ Cover Design
Babu Arts & Kallur Rao, Hindupur.

★ Printers
Lepakshi Art Printers - Hindupur.



★ PRICE Rs. **12-00**

# కృతజ్ఞత

హైదరాబాదు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ
సాంస్కృతిక వ్యవహారాల
శాఖ డైరెక్టరుగారు

రాయలసీమ రచయితల చరిత్ర

చతుర్థ సంపుటి

ముద్రణార్థము

రూ. **5000/-** మొత్తమును
గ్రాంటుగా యిచ్చి
సహాయపడిరి.

వారికి మా కృతజ్ఞతలు.

గ్రంథకర్త :
కవిభూషణ, కవి తిలక,
కల్లూరు అహోబలరావు,

# సంపాదకీయము

రాయలసీమ రచయితల చరిత్ర-1 వ భాగమును 1975 జూలై నెలలో గ్రంథమాల 22 వ పుష్పముగా ప్రకటించినాము. ఇందులో 20 మంది కవుల చరిత్రలు కలవు. రెండవ భాగమును 1977 జూలై నెలలో గ్రంథమాల 23వ పుష్పముగా ప్రకటించితిమి. ఇందులో 31 మంది కవిజీవితములు చేర్పబడినవి. 3వ భాగమును 1981 ఆగస్టులో గ్రంథమాల 28వ పుష్పముగా ప్రకటించితిమి. ఇందులో 50 మంది కవుల జీవితచరిత్రలు కలవు. ప్రకృతము 1986 జూలై నెలలో వెలువడిన 4 వ భాగములో 40 మంది రచయితల, రచయిత్రుల జీవితచరిత్రలు కలవు. మొత్తము 141 మంది జీవితచరిత్రలను ప్రకటింప గల్గితిమి.

రాయలసీమలో అజ్ఞాతముగా మఱియెందరో కవులు, కవయిత్రులున్నారు. వారి నందరిని చేర్చినచో మరికొన్ని సంపుటములు కాగలవు. కాని నా వయస్సు 85. నిత్రాణ ఎక్కువ ఓపిక తక్కువ. గ్రంథమాల పనులన్నీ నా పుత్రునికి చి॥ కల్లూరు రాఘవేంద్రరావునకు అప్పజెప్పినాను. అతడే ముమ్ముందు ఈశ్వరుని కృపవల్ల - ఈపని కొనసాగింప గలడు. ఈ భాగమునందలి కవుల జీవితములను వ్యావహారిక భాషలోనే వ్రాయుట జరిగినది. ఈ పద్ధతిని వ్రాయుటలో నా కుమారుడు నేర్పు గడించినాడు. ఈ కాలమునకీ భాషయే కావలయును గదా!

వాడుకభాషయే గ్రాంథిక భాషయైనది. కాలానుసారము మనము వద్దన్నను వాడుకభాషయే గ్రంథస్థమై తీరును. నేడు కొత్తగా వచ్చిన 6-7 తరగతుల తెలుగు పాఠ్యపుస్తకాలు (ప్రభుత్వ ప్రచురణలు) సహితము ఇప్పుడే పూర్తిగా వ్యావహారిక భాషలో ముద్రింపబడినవి. భాష మరింత నీచస్థితికి దిగజారక వ్యావహారిక భాషయైనా, సాధువుగా, ఇంపుగా, సరళమైన సాహిత్యమై దినపత్రికల సంపాదకీయముల వలె శోభిల్లవలెనని నా అభిప్రాయము.

కీ॥ శే॥ కందుకూరి వీరేశలింగం పంతులుగారు తమ ఆంధ్ర కవుల చరిత్రలో గ్రాంథిక వచన శైలికి ఒక సామాన్య పద్ధతి నేర్పరిచి, గద్య తిక్కన అయినారు. చిలకమర్తి వారు చిన్నయ సూరియొక్క శైలితో "కర్పూర మంజరి" - "సౌందర్య తిలక" (పౌరాణిక నవల) "రామచంద్ర విజయము" (సాంఘిక నవల) "గణపతి" (హాస్య నవల) "గయోపాఖ్యానము" (నాటకము) వ్రాసిరి. గయోపాఖ్యానము లక్షప్రతులు అమ్ముడైనవి. ఇతని శైలి రసవత్తరమైనది. ఆ శైలి అతనితోనే అంతరించినది. శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి/ కామేశ్వరరావుగారు తమ గ్రంథములను వాడుక భాషలో వ్రాసిరి. దానికి కొన్ని నియమముల నేర్పరచిరి. వాడుక భాషకొక నిఘంటువు అవసరమని చెప్పిరి. గ్రామ్య భాషా రచనలకును, గ్రాంథిక భాషా రచనలకును మధ్యే మార్గము

చూపించిరి. ఇట్టి శిష్ట వ్యావహారికభాష గ్రంథస్థము కావలయును గాని ఒక వారపత్రికలో "బుతేనా" అను శీర్షిక భాష మన కక్కఱలేదని నా విన్నపము.

ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీవారు అప్పు తెలుగు నిఘంటు త్రయము 1. ఆంధ్రనామ సంగ్రహము, 2. ఆంధ్రనామ శేషము 3. సాంబ నిఘంటువు ఓటి పద్యాల నేమాత్రము మార్చకుండా పర్యాయపదాల భావములను సూచించు రంగు రంగుల బొమ్మ లతో ముద్రించడానికి కృషి చేయుచున్నారనియు, ప్రభుత్వము 6 లక్షల రూపాయలు మంజూరు చేసియున్నారనియు, పత్రికా ముఖమున తెలియవచ్చుట చాల సంతోషము. 6, 7 తరగతుల వారికి వీటిని బోధింప సంకల్పించుట కూడా ముదావహము. అవశ్యముగా ఈ కార్యక్రమ మాచరణలో పెట్టవలసినదే.

పాఠశాలలలో విద్యార్థుల ద్వారా లైబ్రరీలకు వసూలు చేయ బడు మొత్తములు పూర్తిగా తగ్గిపోయినవి. దానితో పాఠశాలల గ్రంథాలయాలకు పుస్తకములు కొనుటకు వీలుండదని ప్రధానో పాధ్యాయులు పనవి చేయుట పరిపాటి. ఇంకేవిధంగా ఈ పుస్త కాలు అమ్ముడగునో ఆ దైవమునకే ఎఱుక? ఆంధ్ర రాష్ట్ర ప్రభుత్వము మండలమున కొక్క గ్రంథాలయమును, నెలకొల్ప బోవుచున్నట్లు పత్రికలద్వారా, ప్రకటనలు విరివిగా విడుదల యగుచున్నవి. అదెంతవరకు పుస్తక ప్రచురణ కర్తలకు

సహాయకారిగా వుండగలదో వేచి చూతముగాక! ఏమైననూ ప్రభుత్వము గ్రంథాలయములపై ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకొనుట లేదనియే చెప్పవచ్చును.

ప్రస్తుతము పుస్తకముల ముద్రణ జరుపవచ్చును కాని, వాటిని అమ్ముట బహు కష్టమైన విషయము. జిల్లా గ్రంథాలయములుగాని, రాష్ట్రస్థాయిలో ప్రభుత్వముగాని పుస్తకములను ఈ మధ్య కొనుటలేదు. పాఠశాలల, కళాశాలల లైబ్రరీల మాట చెప్ప పనిలేదు.

ఇక, ఇప్పుడు విడుదలగుచున్న నవలల విషయము వేరుగా చెప్ప పనిలేదు. ఇవి ఎంతకాలము నిలువగలవో కూడ చెప్పలేము. వీటి ధరలు ఎంత అధికంగావున్ననూ వాటిని వేలం పెట్టిగాకొని చదవడము జరుగుచున్నది. పత్రికల విషయము కూడ అంతే. న్యూస్‌ప్రింట్ ధర–ముద్రణ–బ్లాకుల ధరలు ఒక వైపు విపరీతముగా పెరుగుచున్ననూ, అందులోని విషయముల విలువ మాత్రం ప్రోత్సాహకరముగా లేదు. పది కాలాలపాటు నిలిచి పదిలపఱచుకొను విషయము ఒంను శూన్యము. తుదకు పొట్లములు కట్టుట కా పత్రిక ఉపయోగపడుచుండుట, మన మెరిగిన విషయమే. పూర్వపు మాసపత్రిక లానాటివారు సంపుటములుగా "బైండు" చేయించుకొని, భద్రపఱచి వుంచిరి. అందుకు కారణ మందలి అనర్ఘరత్నములవంటి విషయములే.

కాగితము లభించని మన పూర్వులు అమూల్యములగు గ్రంథము లను తాటియాకులపై వ్రాసిపెట్టి మన కందించిరి. విరివిగా కాగితము లభించుచున్న ఈనాడు, మన నాగరికులు పనికిరాని చెత్తనంతటిని ముద్రించి, కాగితముల కొఱతను తెచ్చిపెట్టి నారు. ఇది మనము సంపాదించుకొన్న ఖ్యాతి. కాన ప్రభుత్వం కూడ వేలంవెఱ్ఱిగా అన్నిరకములైన పత్రికలకు న్యూస్‌ప్రింట్‌ను కేటాయించుట మంచి పద్ధతి కాదేమో!

సాహితీ సంస్థలు, కవి పండితులు, ఎందరో మంచి పుస్త ములను రచించి ముద్రించుచున్నారు. అట్టి వారి కృతులకు కాగితము లభించుటే దుర్లభముగా ఉన్నది. ప్రభుత్వము కూడ అట్టి వారి రచనల ముద్రణకు తక్కువ ధరలో కాగితము నందిం చుటలేదు. పోనీ, ముద్రించిన పుస్తకములను గ్రంథాలయము లైనా కొని, ప్రోత్సహించుచున్నవా? అదియునూ లేదు. ఇట్టి తరుణములో పాఠకులే ఈ విషయములను దృష్టి యందుంచు కొని తాము ఖర్చుపెట్టిన మొత్తమునకు పదింతలు విలువగలిగిన అమూల్య విషయములు లభించినవా, లేదా? అని వారే ఆలో చించుకొన్నప్పుడు మంచి పుస్తకములు వెలువడు ననుటలో సందేహము లేదు.

తెలుగు సాహిత్యములో అపురూప గ్రంథములు, శతక ములు, వ్యాస సంపుటములు, ప్రబంధములు, కావ్యములు,

నాటకములు, యక్షగానములు, హాస్యరచనలు, కథలు నవలలు నాటికలు, కవితా సంపుటములు మన కింకనూ లభించుట లేవు. వాటి విలువ ఈతరము వారికి తెలియనే తెలియదు. వాటి నెవరు చదువుదురను నిర్లక్ష్యమువల్ల ఆ అనర్ఘరత్నములు, మట్టిపాలగుచున్నవి. వాటిని వెలికిదీసి సానబెట్టి అందించి నప్పుడు అవి వజ్రములవలె ప్రకాశింపగలవు. వాటిని ఆధునికులు కూడా కొని చదువుదురను నమ్మిక కలదు. ఆ ప్రయత్నము చేయుటకే గ్రంథమాల పూనుకొన్నది. ఈ ప్రయత్నమునకు "లహరి" అను సంపుటీ కార్యక్రమ మేర్పాటు చేయుచున్నది.

"లహరి" మూడునెలల కొకసారి వెలువడు త్రైమాసపత్రికను పోలిన ఒక గ్రంథ సంపుటి. ఇందు, తెలుగు సాహిత్యములో అనర్ఘరత్నము లనబడు పై పేర్కొన్న సాహిత్య ప్రక్రియల నుండి మీచే ఎన్నిక చేయబడిన విషయముల కొన్నింటిని వరుసగా "లహరి"లో ముద్రించబడును. వాటిని పాఠకులు మరలా "లహరి" సంపుటినుండి విడగొట్టి విడివిడి పుస్తకములుగా బైండు చేయించుకొని భద్రముగా ఉంచుకొనవచ్చును. ఇవి ముందు తరముల వారికి కూడ ఉపయోగపడి, డబ్బు పెట్టి కొన్నందుకు మంచి గ్రంథ సంచయమును ప్రోగుచేసుకొన్నట్లుగా సంతోషము కల్గును. కాన పాఠకులారా! మా సదుద్దేశ్యములను

అర్థము చేసుకొని ఈ విషయముగా మీరు మాకు చక్కని సలహాల నందివ్వగలరని ఆశించుచున్నాము. మీరెట్టి అపురూప గ్రంథములను కోరుచున్నారో, వాటిని మాకు సవివరముగా తెలియజేయ ప్రార్థన. వాటి నన్నింటిని దృష్టి యుంచుకొని ఈ "లహరి" పథకమును ప్రారంభింతము గాక!

ఈ కార్యక్రమమునకు మీ యందరి సహాయ, సహకారములు, సలహాలు సర్వదా కోరుచున్నాము. కాన, వెను వెంటనే మీ సలహాలు - అపురూప గ్రంథముల పేర్లు తెలియ జేయుడు. ఈ కార్యక్రమమును దిగ్విజయము గావించుడు.

వందనములతో

హిందూపురం
25-7-1986

కవిభూషణ, కవితిలక,
కల్లూరు అహోబలరావు.

# పీఠిక

పుట్టలివి వట్టి వని తాక
బోతిగాని
ఫణమణీ రశ్మి యొకడు క
న్పాప బోడిచె
వెలికి రాబోక తమ వెలుం
గులకె తనిసి
ఎన్నియే వున్నవో లోన
నెవరి కెఱుక!

కీ॥ శే॥ భాస్కరాచార్య రామచంద్రస్వామి గారి "యాత్రికుడు" ఖండ కావ్యానికి, "తొలి నోము" శీర్షికతో శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారు వ్రాసిన తేటగీతమిది. ఈ గీతములో రాళ్ళపల్లివారు రాయలసీమ కవుల మనస్తత్వాన్ని వెల్లడించినారు.

ప్రబంధాలకు పుట్టినిల్లయిన రాయలసీమలో విస్మృత కవులెందరో వున్నారు. తెలుగు కవుల చరిత్ర, కవి తరంగిణి కర్తల దృష్టి రాయలసీమ కవులపై అంతగా పడలేదు. ఆకుచాటు పిందెలవలె ఎందరో కవులు, రచయితలు నేటికీ అజ్ఞాతముగా వుంటున్నారు. వారి చరిత్రలను సేకరించి ప్రచురించినపుడే సాహిత్య చరిత్రకు సమగ్ర స్వరూప మేర్పడుతుంది.

"కవి భూషణ" కల్లూరు అహోబలరావుగారు యాభై ఆరేళ్ళ క్రితం, శ్రీ కృష్ణదేవరాయ గ్రంథమాలను నెలకొల్పి దాదాపు నలుబదికి పైగా రచనలను ప్రచురించి మహోపకారం చేసినారు. రాయలసీమ రచయితలను, రచయిత్రులను వారి రచనలలోని విశేషాలను సోదరాంధ్రులకు తెలియజేయవలెనన్న సత్సంకల్పముతో యిప్పటివరకు వందకు పైగా రచయితలను, రచయిత్రులను గురించి "రాయలసీమ రచయితల చరిత్ర" మూడు సంపుటాలలో వెలువరించారు. ప్రస్తుతం నాలుగవ సంపుటాన్ని మనకు అందజేస్తున్నారు.

సమకాలీనులైన రచయితల చరిత్ర వ్రాయటం అంత సులువైన పనికాదు. శ్రీ రావుగారు రచయితలను స్వయంగా కలుసుకొని విషయ సేకరణ చేసినారు. ఉత్తర ప్రత్యుత్తరముల ద్వారా, మధ్యవర్తుల ద్వారా మరెన్నో సంగతులను సేకరించినారు. సందర్భోచితంగా రచయితల కృతులను సంగ్రహంగా సమీక్షించినారు. ఇంతవరకు బైలుపడని విషయాలెన్నిటినో తెలియజేసినారు. ఈ సంపుటిలో నలుబది మంది రచయితలను పరిచయం చేసినారు.

ఉయ్యాలవాడ కవులు పాణ్యం లక్ష్మీనరసింహయ్య, పాణ్యం సోదరులుగా ప్రసిద్ధిగాంచిన నరసరామయ్య, లక్ష్మీనరసయ్యగార్ల రచనలలోని విశేషాలను వెల్లడించినారు.

పాణ్యం నరసరామయ్యగారు వీరకంకణము, స్వాతంత్ర్యవీరుడు-ఉయ్యాలవాడ నరసింహారెడ్డి వంటి వీర రసస్ఫోరకమైన కావ్యాలను రచించినారు. "విద్యానగర చారిత్రక నవలామాలిక" అను పేర విజయనగర రాజుల చరిత్రను ఇరువది సంపుటాలలో ఆంధ్ర పాఠకులకు అందజేసిన శ్రీనివాసపురం సోదర పంచకము సాగించిన సాహిత్యకృషి చిరస్మరణీయం.

బాలసాహిత్య సృష్టికర్తగా గిడుగు సీతాపతిగారి మన్ననలందుకొన్న పేకుపళ్ళ కామేశ్వరరావుగారు, వాఙ్మయసేవ గావించిన మహనీయుల జీవితచరిత్రలను "నా వాఙ్మయ మిత్రులు" అన్న గ్రంథంగా ప్రచురించినారు. వారి జానపద గేయ వాఙ్మయ చరిత్ర, పూర్వ పదాలు, పాటలు అమూల్యమైన రచనలు. కోలాచలం శ్రీనివాసరావుగారి నాటక సాహిత్యంపై సిద్ధాంత గ్రంథమును రచించి, "క్షేత్రయ్య పద సాహిత్యము"నకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి బహుమతి నందుకున్న డాక్టర్ ఎన్. గంగప్పగారు బాలసాహిత్య, కథాసాహిత్య కృతులు రచించి ప్రశస్తి గాంచినవారు.

సంస్కృత, ప్రాకృత, హిందీ, తమిళాది భాషలలో తలస్పర్శి పాండిత్యమును గడించిన సద్విమర్శకులు తిరుమల రామచంద్రగారు. పాత్రికేయులుగ సువిఖ్యాతులైన రామచంద్రగారు "హైదరాబాద్ నోట్ బుక్" శీర్షికద్వారా ఎందరో అజ్ఞాత

ప్రతిభా మూర్తులను తెలుగువారికి తెలియజేసినారు. జాతీయో ద్యమంలో పాల్గొని కారాగారశిక్ష ననుభవించిన దేశభక్తులు.

తెలుగు - కన్నడముల ఆదాన ప్రదానములను గురించి అవిరళ కృషి సల్పినవారు ఆచార్య కె. సుబ్బరామప్పగారు.

అనాదృత తాళపత్ర గ్రంథాలను అయిదు వందలకుపైగా సేకరించి సాహితీ పరిశోధకులకు మహోపకారం చేస్తున్న సాహితీ వ్రతులు చొక్కాపు నారాయణస్వామి గారు. "మా తెలుగు తల్లికి మల్లెపూదండ" అన్న రాష్ట్రగీతమును రచించి తెలుగువారి మన్నన లందుకొన్న మధురకవి శ్రీ శంకరంబాడి సుందరాచారి.

ఆలూరు రామాశాస్త్రిగారు సుమతి శతకమును కన్నడీ కరించారు. ఉదయిని, వసంతకానుక మున్నగు ఖండ కావ్యాలను రచించిన కర్షకకవి శ్రీ వేదాంతం నరసింహారెడ్డి. శ్రీ వేంక టేశ్వర పుష్పమాల కర్త, రత్నాకరం వెంకటేశ్వర్లు గారు, శ్రీ వేంకట వరదాచార్యులు "సప్రమాణ జ్యోతిస్సార గ్రంథ మును" రచించినారు. శ్రీ లింగుట్ల కోనేటప్ప, గాజుల వేంకట రమణప్ప, మీసరగండ పుల్లమరాజు పెక్కు రచనలు చేసినవారు.

పల్లెప్రజల మధ్య జీవితం సాగిస్తూ వారి జీవితానుభవా లకు అద్దంపట్టే రచనలెన్నో వెలువరించి, "కవికాకి" బిరుద

మందుకొన్న సుకవి శ్రీ కోగిర జై సీతారాం.

ప్రముఖ పాత్రికేయులుగ బహు గ్రంథ కర్తలుగా యావ దాంధ్రులకు సుపరిచితులైన విద్వాన్ విశ్వంగారు, మాణిక్యవీణ మీటుతూ తెలుగుజాతిని జాగృత మొనర్చుచున్న ప్రతిభామతులు.

శ్రీ నూతలపాటి పేరరాజుగారు విజయనగర చరిత్ర, తులసీ రామాయణం, మున్నగు గొప్ప రచనలు చేసిన సాహిత్య వేత్తలు. భాషాశాస్త్రవేత్తలై, తెలుగు హరికథా సర్వస్వ గ్రంథ కర్తలై, "జానపద కళాసంపద" కృతికర్తలై, ప్రస్తుతం తెలుగు విశ్వవిద్యాలయ ఉపకులపతిగా తెలుగు భాషా సాహిత్యసేవ చేస్తున్న భాషాచార్యులు, ఆచార్య తూమాటి దొణప్పగారు.

పెక్కు నవలలు, కథలు, నాటికలు, గేయాలు రచించి, పలుచోట్ల ఆంధ్ర భాషోపన్యాసకులుగ పనిచేసి, "ప్రబంధాలలో ప్రకృతి వర్ణన" అన్న పరిశోధనా గ్రంథమును రచించిన ప్రముఖ రచయిత డాక్టర్ అంతటి నరసింహంగారు. ప్రామాణికంగా, ఔచిత్య భాసురంగా, "ఆంధ్రమహాభారతము - అలంకార సమీక్ష" అను గ్రంథాన్ని ఆంధ్ర సాహిత్య లోకమున కందించిన డా॥ సత్రాజు లక్ష్మీనరసింహారావు గారు వంద్యులు.

విద్యాశాఖలో అధికారిగ బాలసాహిత్యకర్తగా, ఆంధ్రాంగ్లములలో, పెక్కు రచనలు చేసిన అభ్యుదయ రచయిత అవధాని

రమేష్‌గారు. శ్రీ గరుడంపల్లి రోషన్ పండితకవి వంశీయుడు. వీరి తండ్రి ముష్కీన్‌వలి, "నానార్థ పద్య రత్నాకరము" అను వేయి కందములు వ్రాసిన కృతికర్త. పెత్తల్లి రబియాబి, "క్విట్ ఇండియా" ఉద్యమములో పాల్గొని కారాగారశిక్ష ననుభవించిన తొలి మహమ్మదీయ వనిత.

బత్తులపల్లి నరసింగరావు "భక్తకల్పద్రుమము" అను శతకమును రచించిన సంఘసేవా పరాయణుడు. న్యాయవాదిగ వుంటూ "రామరాయలచరిత్ర, వేంకటపతి రాయలచరిత్ర" మొ॥ రచనలు చేసినవారు శ్రీ టి. శివశంకరం పిళ్ళైగారు. ఉపాధ్యాయులుగ జీవిక సాగించి, పెక్కు ఆధ్యాత్మిక రచనలను, అనువాదములను వెలయించిన సరసకవి, పమిడికాల్వ చెంచు నరసింహాశర్మగారు.

"శ్రీ వేంకటేశ్వర గానామృత లహరి", నిర్వచన పద్మావతీ శ్రీనివాస కల్యాణము మున్నగు కృతులను రచించి గాయకులుగ, నటులుగ పేరు గాంచినవారు శ్రీ దుత్తలూరి రామరావుగారు. శ్రీ దేశాయి రామచంద్రరావుగారు "చెయిన్ సర్వే గణిత సూత్ర పద్యావళి" "శ్రీ కృష్ణగారడి" నాటక కర్తలు. "గంగావతరణ-శివతాండవము", "చంద్రగ్రహణము" మున్నగు కావ్యములను రచించిన కవయిత్రి శ్రీమతి కొలకలూరి స్వరూపరాణి.

"నక్షత్రమాల", "మందారమాల" వంటి చక్కని గేయ

కృతులను రచించిన శ్రీ గుంటి లక్ష్మీకాంతమ్మ, జ్ఞానశతకము శివకవచము రచించిన శ్రీమతి గొల్లాపిన్ని రామలక్ష్మమ్మ గారిని గురించి వ్రాయటం అభివందనీయం.

విద్యాశాఖలో పర్యవేక్షకులుగ, శ్రీ గురు రాఘవేంద్ర చరిత్ర కర్తగా, అనువాదకులుగ, వక్తగా సుపరిచితులు, శ్రీ చౌటూరు రామరావుగారు, ఆ యా రచయితల కృతుల నుండి ఆణిముత్యముల వంటి పద్యాలను, గేయాలను వుటంకించడం మరింత ప్రయోజనకరంగా వుంది.

85 ఏండ్ల వయసులో కూడా అవిశ్రాంతంగా, సాహిత్య సేవ చేస్తున్న నిత్య సాహితీవ్రతులు, కవితిలక శ్రీ కల్లూరు అహోబలరావుగారు, తండ్రికి తగిన తనయుడుగా శ్రీ కల్లూరు రాఘవేంద్రరావు సాగిస్తున్న కృషి స్తవనీయమైనది.

వాగ్దేవి వీరిని ఆయురారోగ్య భాగ్యములతో బ్రోచుగాక.

కడప.
28-7-86

జానమద్ది హనుమచ్ఛాస్త్రి

## కొ్రత్తగా చేరిన చిత్రములలో లేని దాతలు

1) బ్రహ్మశ్రీ వేదమూర్తులైన కీ॥ శే॥ భాస్కర వేంకటేశ శాస్త్రులవారి జ్ఞాపకార్థము మనుమడు శ్రీ భాస్కరశాస్త్రి గారు – పరిగి.

2) శ్రీ చౌడూరు రామరావుగారు రిటైర్డు డిప్యూటి ఇన్‌స్పెక్టర్ ఆఫ్ స్కూల్స్ – హిందూపురం.

## రూ, 58–00 చెల్లించిన రాజపోషకులు.

1) శ్రీ కగ్గల్లు సుబ్బరత్నంగారు – హిందూపురం.
2) శ్రీ గుంటి నంజుండశర్మగారు – కల్యాణదుర్గము.
3) శ్రీ తూముకుంట భీమసేనరావుగారు – అనంతపురం.

## రూ. 25–00 చెల్లించిన పోషకులు.

1) శ్రీ ఎస్. ఏ. సత్యనారాయణమూర్తి & సన్స్–హిందూపురం
2) బాగేపల్లి నాగయ్య & సన్స్ – హిందూపురం.
3) శ్రీ సాయికృపా టెక్స్‌టైల్స్, సి. ఏ. ముద్దణ్ణ & సన్స్ హిందూపురం.
4) శ్రీ రామకృష్ణ టెక్స్‌టైల్సు – హిందూపురం.
5) శ్రీ బైసాని నారాయణయ్యగారు – హిందూపురం.
6) శ్రీ విక్రమ్ స్టోర్స్–కె. వి. జగన్నాథగుప్త & సన్స్ డిటో
7) శ్రీ అణికాపు బ్రహ్మరాయప్పగారు–మండి మర్చెంట్, డిటో
8) శ్రీ జయం సత్యనారాయణశ్రేష్ఠి గారు – హిందూపురం.

9) శ్రీ రాధాకృష్ణ సత్యనారాయణశ్రేష్ఠి-ఆయిల్ మిల్స్,
హిందూపురం.

10) శ్రీ కారుపాకుల క్రిష్ణయ్యశ్రేష్ఠిగారు డిటో

11) శ్రీ వై. సదాశివన్‌గారు-హెడ్-మాస్టర్-సేవామందిరం.

12) శ్రీ మాకం నారాయణయ్యశ్రేష్ఠిగారు, పేపరు ఏజెంటు,
హిందూపురం.

13) శ్రీ వి. ఎల్. ప్రసాద్‌రావుగారు, అకౌంటెంటు.
సుధానగర్-పరిగి పోస్టు-హిందూపురం.

14) శ్రీ సి. చిన్నబాలకంబన్నగారు-హిందీ పండితులు,
యం. జి. యం. హైస్కూలు, హిందూపురం.

15) శ్రీ టి. కామేశ్వరరావు బి.ఏ; బి.యిడి;-1-18,
కామయ్యనాయుడు కాలని, చిత్తూరు-4

16) శ్రీ కరణం ఛాయప్పగారు-ఘూస్వామి, మలుగూరు.
హిందూపురం తా॥

17) శ్రీ కొండయ్యశ్రేష్ఠిగారు-కిరాణా మర్చెంట్-పాతూరు,
అనంతపురం.

18) శ్రీ కె. రామరావుగారు B.P.M, బ్రహ్మసముద్రం Via
కణేకల్లు.

19) శ్రీ కె. వి. నాగరాజరావు S/o. వెంకటాచలమయ్య
కనకాపురం-గౌడేటి పోస్టు-పావగడ తా॥

20) శ్రీ దొంతి రామయ్యశ్రేష్ఠిగారు, నగరగెరి.

21) శ్రీ ఏ. మహమ్మద్ ఖాసీంగారు, సెక్రెటరీ-నరహరి
ఆశ్రమము, తహసీలుదారు రోడ్, రాయదుర్గం.

22) శ్రీ నరసింగరావుగారు, రిటైర్డు తెలుగు పండితులు, పెనుకొండ.

23) శ్రీ కె. కె. సుబ్బరావుగారు, భూస్వామి, కల్లూరు, హిందూపురం తా॥

24) శ్రీ కరణం రామరావుగారు, ,, ,, ,,

25) శ్రీ కె. బి. ప్రాణేశ్వరరావుగారు, సొసైటి సూపర్ వైజర్-రాయదుర్గం.

26) శ్రీ యం. గోవిందరావుగారు, డాక్టరు, బవరంపల్లి కల్యాణదుర్గం తా॥

27) శ్రీ జయకీర్తిగారు-మునిసిపల్ కౌన్సిలర్-హిందూపురం.

28) శ్రీ ఆశావాది ప్రకాశరావుగారు-లెక్చరరు-గుంతకల్లు.

29) శ్రీ ఆర్. శ్రీనివాసులుగారు-శ్రీ నిలయం-గుంతకల్లు.

30) శ్రీ రావినూతల శ్రీరాములుగారు, సబ్-రిజిష్ట్రారు, అనంతపురం.

31) శ్రీ తలుపుల వెంకటయ్యగారు-టింబరు మర్చెంట్ ,,

32) శ్రీ బయన్న మరియు కొండారెడ్డిగారు, కోర్టు రోడ్, అనంతపురం.

33) శ్రీ కె. చెన్ననరసప్పగారు, అర్చకులు, శ్రీరామ మందిరం-చిలమత్తూరు-హిందూపురం తా॥



## చిత్రములలో లేని దాతలు.

1. శ్రీ కె. అనంతరామయ్యశ్రేష్ఠి మండీ మర్చెంట్,
హిందూపురం
2. శ్రీ యం. వి. వి. చలం, Ex-మునిసిపల్ ఛేర్మన్ ,,
3. శ్రీ మాకం కృష్ణమూర్తి, సెక్రెటరీ-నరహరి
సద్గురు ఆశ్రమం, ,,
4. శ్రీ పరుచూరు హనుమంతయ్యశ్రేష్ఠి, గీతా మందిరం
ప్రెసిడెంట్-అనంతపురం.
5. శ్రీ కె. యస్. సత్యనారాయణగుప్త, గుప్తా స్టోర్స్,
హిందూపురం
6. శ్రీ యు. మునిరెడ్డి, భూస్వామి, బనశంకరీ, బెంగళూరు.
7. శ్రీ సుంకు సుబ్బలక్ష్మయ్య, కాటన్ కమీషన్ ఏజెంట్స్,
తాడిపత్రి
8. శ్రీ యం. రామిరెడ్డి, Rtd; ఎక్సైజ్ సూపరింటెండెంట్,
అనంతపురం
9. శ్రీ కె. వి. రత్నంశెట్టి, ప్రెసిడెంట్ హిందూపురం ఆర్య
వైశ్య సంఘం-హిందూపురం
10. శ్రీ సకలా నరసింహులుశ్రేష్ఠి, ప్రతిభా జ్యూయలర్స్,
బెంగళూరు
11. శ్రీ గుంటూరు విజయమోహన్ B.Sc.,
S/o. కీ. శే. గుంటూరు సుబ్బరాయుడు - అనంతపురం
12. శ్రీ కట్టా లక్ష్మినారాయణయ్య ఎక్స్-మునిసిపల్-ఛేర్మెన్,
హిందూపురం.

13. శ్రీ గొల్లాపిన్ని రామకృష్ణశాస్త్రి - అనంతపురం
14. శ్రీ జూటూరు రమణయ్యశ్రేష్ఠి, కృష్ణా ఆయిల్ మిల్స్, ప్రొద్దుటూరు
15. శ్రీ డాక్టరు సి. యం. కృష్ణమూర్తి, ప్రభుత్వ వైద్యులు, మడకశిరా
16. వరకాల రామ నరసింహారెడ్డి, తెలుగు లెక్చరరు-బెంగళూరు

-ః చందాదారులు ః-

1) శ్రీ డి. వెంకటాచలపతిశ్రేష్ఠిగారు - మడకశిరా.
2) శ్రీ యం. తిప్పయ్యశ్రేష్ఠిగారు - ,,
3) శ్రీ పి. కె. నారాయణశ్రేష్ఠిగారు - ,,
4) శ్రీ శ్రీరాం వెంకటరత్నంగారు-అకౌంటెంటు. ,,
5) శ్రీ సి. ఆదెన్నశ్రేష్ఠిగారు-క్లాత్ మర్చెంట్, ,,
6) శ్రీ కాసుల గోపాలయ్యగారు-జనరల్ మర్చెంట్ ,,
7) శ్రీ డాక్టరు యం. వెంకటకొండప్పగారు, శ్రీ సత్యసాయి క్లినిక్-మైన్ బజార్ ,,
8) శ్రీ కె. నంజుండరావుగారు-టీచరు-సడ్లపల్లి-హిందూపురం
9) శ్రీ పద్మనాభరావుగారు-టీచరు-నింకంపల్లి- ,,
10) శ్రీ మద్దూరు శ్రీనివాసరావు - రాజమండ్రి.



(గ్రంథకర్త - వారి ధర్మపత్ని)

శ్రీ కల్లూరు అహోబలరావుగారు

శ్రీమతి కల్లూరు సీతమ్మ



**శ్రీ కల్లూరు రాఘవేంద్రరావు**

సెక్రెటరి

శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల,

హిందూపురం.

# రూ. 316-00 సమర్పించిన దాతలు



## శ్రీ కట్టా శేషయ్య గారు

షరాబు వర్తకులు, మైస్ బజార్, హిందూపురం.

వీరికి భగవంతుడు ఆయురారోగ్యముల నిచ్చి
కాపాడుగాక!

# రూ. 116-00 సమర్పించిన దాతలు



బాలకవి

## శ్రీ పాలుట్ల వెంకటనరసయ్య

రాజుపాలెం. త్రిపురాంతకం (పటూ)

ఎఱ్ఱగొండపాలెం తా॥ ప్రకాశం జిల్లా (ఆంధ్ర)

వీరికి భగవంతుడు ఆయురారోగ్య భాగ్యముల నిచ్చుగాత!

## రూ. **116-00** సమర్పించిన దాతలు

కీ॥ శే॥ కరణం రామదాసరావు



స్వాతంత్ర్య సమరయోధులు - మేళవాయి.
వీరి జ్ఞాపకార్థం కుమారుడు శ్రీ కె. సత్య
నారాయణరావు M.A; విరాళమిచ్చిరి

సరసకవి శ్రీ బండమీదపల్లె భీమరావు



రిటైర్డు టీచర్ - అనంతపురం.

వీరలకు భగవంతుడు ఆయురారోగ్యములను ప్రసాదించుగాత!

116-00 సమర్పించిన పాత్రలు



వీరి జ్ఞాపకార్థం జి. శ్రీనివాస్ & బ్రదర్స్‌వారు ఇచ్చిరి.

కీ॥ శే॥ గౌరా సుబ్బరాయశ్రేష్ఠి-ఆదోని

రూ. 516-00 సమర్పించిన వారు



క్రొత్తపల్లి శ్రీ శకుంతలా నాగేశ్వరరావు

గుంతకల్లు.

## రూ. 516-00 సమర్పించిన దాతలు



రచయిత - కవిపోషకులు

డా॥ శ్రీ మల్లెమాల వేణుగోపాలరెడ్డి

కడప.

## రూ. 116-00 సమర్పించిన దాతలు



శ్రీ యం. అశ్వత్థనారాయణగుప్త

పరిమళ ఆటో ఫైనాన్స్-భాగస్వాములు

హిందూపురం.

వీరికి భగవంతుడు ఆయురారోగ్యములను ప్రసాదించుగాక!

## రూ. 116-00 సమర్పించిన దాతలు



శ్రీ గుంటూరు నారాయణస్వామి

సర్పంచ్ - సిద్దరాంపురం.

ఈశ్వరుడు వీరిని కాపాడుగాత!



శ్రీ యస్. మల్లేశప్ప

మునిసిపల్ ఛేర్మెన్, రాయదుర్గం.

భగవంతుడు వీరిని కాపాడుగాత!

**రూ. 316-00** సమర్పించిన దాతలు



శ్రీ శ్రీ శ్రీ నరహరి సద్గురు ఆశ్రమ
పీఠాధిపతులు

## శ్రీ సింహాద్రి స్వాములవారు

పిఠాపురం.

**రూ. 116-00** సమర్పించిన దాతలు



## నగరగిరి రామేశ్వరశాస్త్రి దంపతులు

నగరగెరి. (కర్నాటక)

వీరికి భగవంతుడు ఆయురారోగ్య
భాగ్యముల నిచ్చి కాపాడుగాత!

## రూ. **116-00** సమర్పించిన దాతలు



శ్రీ కె. వి. గోవిందయ్య శ్రేష్ఠి గారు

మ ద క శి ర.

వీరికి సర్వేశ్వరుడు సదా రక్షించుగాత!



డా॥ శ్రీ గొట్టుముక్కల

సూర్యనారాయణరాజు R.M.P.

కొత్తవలస - P.O. వైజాగ్ జిల్లా

## రూ. 116-00 సమర్పించిన దాతలు



### శ్రీ చౌళూరు రామరావుగారు

రిటైర్డు స్కూల్ ఇన్‌స్పెక్టర్,

హిందూపురం.

శ్రీ పరమేశ్వరుడు వీరికి ఆయురారోగ్యములనిచ్చి

సదా కాపాడుగాత!

## శ్రీమతి కె. కళావతి-జ్ఞాపకం



**జననం: 27-1-63** నిర్యాణం: 6-5-86

గ్రంథకర్తగారి మనుమరాలు

కె. సుందరరాజారావుగారి ద్వితీయ పుత్రిక.

వివాహమైన రెండు నెలలకే మూడు

వరాల బలహీనతతో దివి చేరినది.

ఈమె ఆత్మకు శాంతి కలుగుగాక!

## శ్రద్ధాంజలి

ఇటీవలనే దివంగతులైన

"కవితారామవసంత"

## విద్వాన్ మణూరు రామరావు

నిర్యాణము: 24-1-1986

మరియు

[illegible] - విద్వాన్

## రూపావతారం నారాయణశర్మ

నిర్యాణం: 15-8-[illegible]

వీరల స్మృతికి సంతాపాన్ని ప్రకటిస్తూ వారి

ఆత్మలకు శాంతి కలుగుగాక యని

భగవంతుని ప్రార్థించుచున్నాము.

# విషయసూచిక

పేజి నం.







# శ్రీ పాణ్యాం లక్ష్మీనరసింహయ్య

జననము: 6-4-1920

నిర్యాణము: 1978-79 మధ్య

తల్లి: శ్రీమతి సుబ్బలక్ష్మమ్మ

తండ్రి: శ్రీ పాణ్యాం లక్ష్మీనరసయ్య

జన్మస్థలం: కర్నూలు జిల్లా - కోయిలకుంట్ల తా॥ - ఉయ్యాలవాడ

హరిభక్తులు, వేదాంత వేత్తలు, ధర్మజ్ఞులు, ప్రజ్ఞాన్వితులైన వంశీకుల యింటబుట్టిన పాణ్యాం లక్ష్మీనరసింహయ్య గారి హృదయమున చిఱుత ప్రాయముననే ధర్మమీమాంసయు, ధర్మతత్పరతయు మొలకలెత్తుచు, ప్రతిచిన్న విషయము "ఇది శాస్త్రీయమగునా? కాదా?"యని వివేచించుటయు, విజ్ఞులగు పెద్దలనడిగి తెలుసుకొని ధర్మమని తెలిసిన దానిని యథాశక్తి నాచరించుటకు నలవాటుపడిరి. వయస్సు పెరిగినకొలది వారిలో ఆ తత్త్వము తనంతటతానే అభివృద్ధి చెందుతూ వచ్చినది.

ఈ ధర్మమీమాంసయందు కొట్టుమిట్టాడుచున్న నరసింహయ్యకవిగారికి నేటి సాంఘిక రాజకీయ ధర్మ విప్లవగతులు తలపునకు వచ్చినప్పుడెల్లనూ భయవిషాద పరితాపములు [illegible] కొని నిదుర బట్టదయ్యెను. తుదకొక సుప్రభాత [illegible]యమున ధ్యాన నిమగ్నుడైన నీ కవివరునకు యాతని హృదయా[illegible]

మున విద్యుల్లేఖవలె ఒక క్రొత్త భావము స్ఫురించినది. దానిని వారు తన మనశ్శాంతికై, భగవంతుడు ప్రసాదించిన ప్రేరణగా భావించిరి. ఆ భావ మేమనగా "ఏ యుగమునం దేకాలమున, ఏ స్థలమునందు, ఏ నామరూపములుగల భూతములెట్లెట్లు వ్యవహరించునో, ఆ యుగములెప్పుడు వచ్చినను ఆ కాలమున, ఆ స్థలము నందు ఆయా నామరూపములుగల భూతములు అట్లట్లే వ్యవహరించుచుండును." ఈ భావన కవిగారికి మనశ్శాంతిని కలిగించినది. ఈ విషయముగూర్చి, గ్రంథాన్వేషణ గావించగా వారికెన్నో ఆధారములు లభించినవి. ఆ భావములను తొలుత వ్యాసములుగా వ్రాసి పత్రికలలో ప్రకటించిరి. ఈ ధర్మములు క్షణికములు కావనితలచి, అందలి కొన్ని ధర్మములను, పొందుపఱచి "ధర్మజ్యోతి" యను గ్రంథముగా వెలువరించిరి.

శ్రీ లక్ష్మీనరసింహయ్య గారు తండ్రిగారి వద్దను, పినతండ్రిగారైన శ్రీ వాసుదేవశాస్త్రిగారి వద్దను, వెలుదుర్తిలోని అన్నదానం సుబ్బాశాస్త్రిగారి వద్దను, శ్రీ గౌరిపెద్ది శేషశాస్త్రుల వద్దను సంస్కృతాంధ్రములు నేర్చిరి.

ఈ కవిగారికి శైశవమందే కవిత్వమబ్బినది. ఉత్పలమాలావృత్తములలో "ఈశ్వరశతకము" నప్పుడే వ్రాసిరి. తదుపరి సీసపద్యములలో ఉయ్యాలవాడలోని శ్రీ కోదండరామస్వామిని, స్తుతిస్తూ "శ్రీ కోదండరామశతకము"ను రచించిరి.

ఇందలి ప్రతి పద్యమునందును ఉత్తమ ఆదర్శము, కవిగారి అనుతాపము, హృదయావేదన, ప్రతిబింబించును. నేటి నవ నాగరికతయొక్క విచిత్ర పరిణామములను, వాని అనర్థములను లోకమునకు వెల్లడి చేయవలయునను పట్టుదల, యిందు ప్రధానముగా గానవచ్చును. అందలి మచ్చునకొక పద్యము చూతము.

సీ॥ సీమంతి నీత్వలక్ష్మిని దెల్పు, చక్కని
పాపటల్ - వక్రత బడయ జొచ్చె,
దాంపత్య ధర్మతత్త్వము దెల్పు మంగళ
సూత్రబంధము, నైచ్యపాత్రమయ్యె,
దీర్ఘమాంగల్యంబు - దెల్పు కుంకుమబొట్టు
లావగింజలకన్న - నణువులయ్యె,
సతత పతివ్రతా - చరణదీక్షా చిహ్న
కంకణ ధారణల్ - కలుషమయ్యె,

తే॥గీ॥ నకట! పాశ్చాత్య నవనాగరకత వచ్చి
హైందవస్త్రీల భావమ్ము - లందునిల్చి
పావనాచార, సాధు సంపత్తి నణచె;
ధరణి, నుయ్యలవాడ! కోదండరామ!

వీరి రచనలన్నియు, తత్త్వవిచార వాసనా శోభితములై యుండుట విశేషము. వీరి "శ్రీ విశ్వేశ్వరనక్షత్రమాల" కృతి

ఆ కృతిలో చిన్నదైననూ రసజ్ఞులగు,చదువరుల హృదయమును ద్రవింపజేసి, కన్నుల జెమ్మగిల్లజేయును. కవిగారు తమ జీవితానుభవమును రంగరించి, మొత్తము మానవ జీవితానుభవ పాఠమును, మన కన్నుల ముందుంచి ధన్యులైరి.

భార్యాపుత్ర కుటుంబ మోహమున నే-బంధంబునన్ జిక్కి, స
త్కార్యాకార్యవివేక వర్జితుడనై -గావించితిన్, బాపముల్
సౌర్యుద్దండ ప్రచండ దండనలకున్, స్వాంతంబు భీతిల్లె; నో
యార్యావల్లభ! యెట్లు బ్రోచెదవో? నిన్నర్థింతు, విశ్వేశ్వరా!

మానసికముగా ఎదిగిన వారికి, వృద్ధాప్యమునందు పశ్చాత్తాపము తప్పదు. వార్ధక్యము, ఇహపర జీవిత సాగరముల నడుమగల వారధి. జన్మ సంస్కార ఫలమువల్ల, కవిగారు తమ జీవితానుభవసారము నెల్లరకు పంచి మార్గదర్శకులైరి.

"శ్రీ రామతత్త్వ రహస్యము" వీరి మరియొక కృతి. "ఈ కృతి నొకమారు పఠించి మననము చేసికొనినచో, సులభమగు పరతత్త్వ వివేచనము కలిగి, పరబ్రహ్మాను సంధాతయగుటకు లోపము లేదనవలయును." కవిగారు శ్రీ రామతత్త్వమును కథా సంవిధానముతో జోడించి, ఎట్లుచెప్పిరో ఈ క్రింది పద్యమువలన మనకు విశదమగును.

శ్రీరామాఖ్యుడె యాత్మ; బుద్ధియనగా సీతామహాదేవి; కా

ర్యారంభమ్ము లొనర్చుచుండు మనసే-యారావణ బ్రహ్మ; త
త్సార గ్రీవము లింద్రియంబులగు; దత్కామ రోషాదులే
యారక్షఃపతి సైన్యపంక్తి; తనువే యాలంక తత్త్వస్థితిన్.

ఇట్లు కవిగారు మనస్సు నందనుభవ పూర్వముగ దెలిసిన విషయమును దాచక గద్యపద్య రూపములగు గ్రంథములుగా సంతరించి వెలయింప నుద్దేశించిన, వీరి కృషి అమేయము, నిరుపమానమని చెప్పవచ్చును.

వీరు కేవలము, పరమార్థదృష్టితో లోకసేవయే, ముఖ్య సాధనముగ నెంచి తమ యనుభవమున నార్జించిన, జ్ఞానధనమును తమ తోడివారికి బంచిపెట్టి ధన్యులైన మహనీయులు.

కం॥ ధర్మంబు జెఱుప జెఱచును
ధర్మము రక్షించువారి దా రక్షించున్
ధర్మంబు జెడక యుండును
నిర్మలమతి నడవవలయు నిశ్చలనియతిన్ (భారతము)

ఇట్టి నిర్మలమైన ధర్మప్రతిష్ఠా వాక్యములను మనస్సునందు నిశ్చలముగా నిలుపుకొని, లోకోపకారార్థమై జీవితాంతమట్టి రచనలనే రచించి వెలయించిన శ్రీ పాణ్యా లక్ష్మీనరసింహయ్య గారు ధన్యతపొంది, కీర్తివంతులైరి.



# పాణ్యం సోదరులు

శ్రీ పాణ్యం లక్ష్మీనరసింహయ్య గారికి, ఐదుగురు కుమారులు, ఇద్దరు కుమార్తెలు. వీరి పెద్ద కుమారుడు. శ్రీ పాణ్యం నరసరామయ్య. ప్రతిభాశాలి. సంస్కృతాంధ్రములు, చక్కగ నేర్చి, చిక్కని, కవితల్లల్లగలిగిన యువకవి. వీరును వీరి పెద్దతండ్రి కుమారుడైన పాణ్యం లక్ష్మీనరసయ్య గారును కలిసి "పాణ్యం సోదరుల"ను పేర తొలుత "ప్రభాతరేఖల"ను ఖండకావ్యమును వెలువరించిరి. ఈ ఖండకావ్యమునకు శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యుల వారు తొలిపలుకులు వ్రాసిరి. అందు వారీ సోదరులనుగూర్చి యిట్లు వ్రాసిరి.

"ఈ కవులు ఆంధ్రమును బాగుగా దఱచినారు. సంస్కృత సాహితీనదులయందు తానమాడినారు. ప్రాచీనాధునాతన, కవితా రీతుల, నాకట్టుకొన్నారు. జన్మతోబుట్టిన సంస్కారబలమున్నది. వీరి ఖండికలను జూచినప్పుడు నా భావనానేత్రము..........., వీరి యుజ్జ్వల భవిష్యత్తును స్పష్టముగా జూడగలుగుచున్నాను."

పై మాటలలో, అతిశయోక్తి యేమాత్రములేదు. ఇరువురును కవిత్వమల్లుటలో సమవుజ్జీలే. కవితారథము నీడ్వగల్గిన మంచికుజ్జులే. వీరి ప్రభాతరేఖల ఖండకావ్యము "చక్కని భావనాశక్తి – కావ్యమునకు జీవనమైన ధ్వని – గంభీర

మైన పదగుంఫన, దీర్ఘీకృతములైన, పరుషములైన సమాసము లతో పొందుపరచబడినది." ఇందలి ఒక పద్యమును మచ్చునకు చూతము.

సీ॥ మనసోగ వెన్నెలలను, జగంబులబూయు
చందురులో కందు-జిందితేల?
జిలుగు వెలుగుల, తళత్తళలతో మించు, క్రొ
మ్మించులో చాంపల్య ముంచితేల?
వన్నెవన్నెల మేని చిన్నెల, జెన్నొందు
బెబ్బులిలో, జుల్మబెట్టితేల?
నలుదెసల్ గమగమల్ వలపించు సంపంగి
విరిలోన వెగటు జొప్పించితేల?

గీ॥ ఈ మహత్తర శిల్పాన, యేమి? యేమి?
యెత్తుగడలున్నవో యేమొ? యెవడెఱుంగు?
అప్రతిహతాఖిల, చరాచర ప్రపంచ
హృదయచిన్మూర్తి! నీ సృష్టికిదె! జోహారు!

# శ్రీ పాణ్యం నరసరామయ్య

పాణ్యం నరసరామయ్య, చిన్నప్పటి నుండి కావ్యము లల్లు నలవాటుగల వాడగుటచే, నేదైనా కావ్యము వ్రాయవలె

ననెడి యాతని అభిప్రాయమునకు శివభారత కర్తలైన, శ్రీ గడియారం వేంకటశేషశాస్త్రి గారొకపరి, ఏదేని ఒక చిన్న యితివృత్తమును, గ్రహించి రచన సాగించి, అభ్యాసపాటవమున ఫలసిద్ధి, పొందవలసినదిగా నుపదేశించిరి. ఆ యుపదేశముతో, ఆతడు వారికి ఏకలవ్యశిష్యుడై "వీరకంకణము" అనుపేర విశ్వనాథనాయక చరిత్రను పద్యకావ్యముగా రచించిరి.

వీరకంకణమొక చారిత్రాత్మక పద్యకావ్యము. ఇది శ్రీ కృష్ణదేవరాయల కాలమున జరిగిన కథ. చోళరాజు, పాండ్యరాజును పారద్రోలి ఆతనిభార్యను చెరబట్టిన విషయము రాయలవారికి తెలియగా, ఆయన తనకు విశ్వాసపాత్రుడైన, నాగమనాయకుని సైన్యముతో చోళరాజుపైకి యుద్ధమునకు పంపెను. నాగమనాయకుడు చోళరాజును జయించి, ఆ రాజ్యమును మరలా పాండ్యరాజున కివ్వక, తానే స్వతంత్రించి రాజుగా ప్రకటించుకొనెను. ఇది తెలిసిన కృష్ణరాయలు, ఉగ్రులై సభలో యిట్లు ప్రకటించిరి.

ఉ॥ ఏ జగజెట్టియైననుసరే! చనుదెంచి, రణాంగణంబునన్
దేజము దెంపుజూపి జననిందితు నాగమనీని బట్టి మా
యోజను బెంచువానికి, సముజ్జ్వల సాహసమూర్తికిన్,యశో
భాజన'వీరకంకణ 'ముపాయన మియ్యది;భోగ్యమయ్యెడున్

ఆ ప్రకటన విన్నంతనే "లేత జవ్వనమున నూనూగు మీసములు వచ్చిన వీరరసంబునాగ, నజ్జనపతి ముందటన్నిలిచి సాగిలి మ్రొక్కి, నొకండు దీర్ణుడై -"

మ॥ అతడే వీరమ నాయకుండ హిత బాహాగర్వ నిర్వాహణో
ద్ధత నిర్వక్ర పరాక్రమక్రముడు, ప్రోద్యద్ధర్మ దీక్షా సమం
చిత,పుణ్యోదయమూర్తి,నాగమ మహాసేనానికిన్ బుత్రకుం
డతిలోక ప్రభుభక్తి తత్పరత దృష్టాంతంబు; లోకంబునన్.

అతడు అంజలి ఘటించి తండ్రిపై యుద్ధము ప్రకటించి నాడు. యుద్ధమునకు ముందు తండ్రీకొడుకులకు నడుమ జరిగిన వీరోచిత సంభాషణమును కవిగారు అతి చక్కగా, గంభీరత చెడ నట్లుగా, మఱి మఱి పఠించి యానందింపదగినదిగా రచించినారు.

ఇయ్యది వీరరస ప్రధానమైన కావ్యము. ప్రతి పద్యము వదలక చదువ వలసినదేకాని, విడిచి ముందుకు సాగలేము.

"వీరి కవిత వలచి వచ్చినదిగాని, బలాదాకృష్యమాణ గాదు. ఇందారంభమునుండి, కొసవఱకు జక్కని పదజాలముతో స్వాభావికమగు నడకలతో, పద్యములు హృద్యములై కవి యొక్క సరళత్వమును బ్రదర్శించుచున్నవి. అనవసరములగు వర్ణనల, జోలికిబోక తగిన రీతిగా నడుపబడిన, ఈ కవిత యెంతయు గొనియాడదగియున్నది. కావ్య లక్షణము లొక్కిం

తయు, సడలనీక యిందు బొందు పఱచుట హర్షింపదగిన విషయము”-ఇయ్యది శ్రీ జనమంచి వేంకట సుబ్రహ్మణ్యశర్మ గారు కావ్యముపై వెలువరించిన సదభిప్రాయము.

వీరి రెండవ కావ్యము “స్వాతంత్ర్యవీరుడు”. ఇది కర్నూలు జిల్లాకు చెందిన ఉయ్యాలవాడ గ్రామవాసియైన శ్రీ నరసింహారెడ్డి చరిత్ర. ఆతడు ఆంగ్లేయులపాలన నంతమొందింప నెంచిన సాహసి. జానపదులాతని “రెడ్డికాదు బంగారుకడ్డీ” అని కీర్తించిరి. ఆతని సాహస మంతా యింతా కాదు. ఏటేటా ప్రభుత్వమిచ్చు “తవజ్జీ” అను భరణము కొరకై రెడ్డి ఎవరినో ఒకరిని తహసీలుదారు కడకు పంపుచుండిరి. కానీ కోవెలకుంట్ల తహసీలుదారునకు, రెడ్డికి నేదో ఒక సందర్భమున వాగ్వాదము జరిగి వుండుటచే, “దాసరి క్రిందకూడ, నొకదాసరియా” యని యీసడించి “ఆ దాసరివచ్చి మమ్మడిగి ద్రవ్యము గై కొనవచ్చు” నని దురుసుగా మాట్లాడిరి. దానితో రెడ్డి రెచ్చిపోయినాడు. వాని “తల తీయక విడుతునా!” యని ప్రతిజ్ఞ పట్టి దండుతో, తాలూకాఫీసు మీదికి దాడి జరిపినాడు. రెడ్డి దండు చూడగానే రక్షకభటులు తుపాకులు వదలి పరుగెత్తినారు. రెడ్డి ఉగ్ర నరసింహుని రూపము దాల్చి

కఱ కఱ పండ్లునూరి, చెడుగా! యిటురమ్మని, పట్టి ఈడ్చి ని
ర్భరమగు, నక్కసమ్ము మెయి, వాని శిరమ్మును నేలద్రున్న చుం

గఱకు కటారు గేలకొని గ్రక్కునవైవ, శిరంబు మొండెమున్
ధరణి పయింబడెన్ రుధిర ధారలు మందిరమెల్ల జిమ్ముచున్.

ఇట్లాతని చంపి ఆంగ్లేయులపై కక్షగట్టిన క్షాత్రవతంసు డతడు.

ఇట్టి సాహసవీరుని స్వగ్రామమగు ఉయ్యాలవాడ యందు బుట్టిన మన నరసరామయ్యగారు సాహసించి, ఈ వీరుని కథను జానపద పదములకే పరిణితిబెట్టక, కావ్యరూపము నిచ్చి రాయల సీమకు కీర్తి తెచ్చిరి.

నరసరామయ్యగారి రెండు కృతులు, చరిత్రకు సంబంధించి నవే యైనను, వీర కంకణ కృతి శైలికిని, యిందు జూపిన శైలికిని, భిన్నత్వము స్పష్టముగా గోచరించును. రెడ్డి చరిత్ర పండిత పామర జనానందకరమై యొప్పుచున్నది. ఈ రెండు కావ్యములవల్ల ఈ కవి సంస్కృతాంధ్రములలో పుష్కలమైన పాండిత్యము, కవితలో నిండైన ప్రావీణ్యము, కలవారని తేటతెల్లమగుచున్నది. ఈ కవిగారు రెడ్డి చరిత్రను అసమగ్రముగా ప్రచురించిరి. ఇది పాఠకులకు కొంత అసంతృప్తిని కలిగించినదని చెప్పవచ్చును. దీని రెండవ భాగము ప్రచురించి, నరసింహారెడ్డి చరిత్రకు సంపూర్ణత చేకూర్చి కవివరేణ్యులు ధన్యులగుదురు గాత!

# శ్రీ పాణ్యం లక్ష్మీనరసయ్య

వీరు శ్రీ పాణ్యం లక్ష్మీనరసింహయ్యగారి అన్న కుమారులు. పాణ్యం నరసరామయ్యతో కలసి "పాణ్యం సోదరులు"గా వాసికెక్కినవారు. వెల్దుర్తి వీరి జన్మస్థలము. చిన్నతనము నుండియే, కవిత్వమన్నెడి అభ్యాసము వీరి కలవడినది. సోదరుడు నరసరామయ్యతో వీరికి కుదిరిన సఖ్యముతో, ఈ ఇద్దరి హృదయము లేకమైనవి. "వీరి భావములు పూర్తిగా తెలిసికొనలేనంతగా నైక్యమైపోయినవి." అందుకు "ప్రభాత రేఖలు" ఖండ కావ్యమే సాక్షి. వీరి స్వతంత్ర రచన "శ్రీ గురుస్తోత్రమాల" ఇందు వీరి రచనా విధానమిట్లు సాగినది.

సందేహమ్ములు వాయుచోటు; మదులన్ సద్వాసనా దివ్యముల్
మందారమ్ములు విచ్చుచోటు; తొలగన్ మాలిన్య విక్షేపముల్
డెందమ్ముల్, నిలు పొందుచోటు; పరిపాటిన్నిత్యమాధుర్యమా
నందం బయ్యది పొంగుచోటు; బుధగణ్యా! నీ పదధ్యానమే॥

ఇంతటి చక్కని రచనను వ్రాయగలిగిన ప్రతిభాశాలురైన వీరు మరితర పొత్తములేవియు వ్రాసినట్లు లేదు. ఒక్క ఖండకావ్యము మాత్రమే "పాణ్యం సోదరులు" జంటగా కలిపి వ్రాసినది. తరువాత జంటగా రచనలు సాగించినట్లు లేదు. ఏమైననూ పాణ్యం సోదరులు తమ కవిత్వము 'పిల్లకవిత్వము' కాదని-"మేల్ హోయల్ గల కవిత్వ విలాసమ"ని నిరూపించిరి.

# శ్రీనివాసపురం సోదరులు

శ్రీకరమై సిరిసంపదలకు నాలవాలమై అతి ప్రాచీన కాలము నుండి అభ్యుదయ పథమున, పురోగమించిన ఆంధ్ర భూమి యందలి రాయలసీమ, రత్నగర్భయే గాక, అనేక కవి పండిత మాన్యమనీషి రత్నములనుగన్న భారతసుపుత్రి. ఆంధ్ర కర్ణాటక రాజ్యలక్ష్మికి కీర్తి ప్రతిష్ఠలను జేకూర్చి ఉజ్జ్వల వైభవోన్నతుల కాటపట్టుగా, నాటి సారస్వత సామ్రాజ్యంలో కవిపండిత పరికాండులకు ప్రాభవ వైభవ, సన్మాన సత్కారములతో పీరాజనము పట్టిన "విజయనగర రాణ్మహీపతుల సామ్రాజ్య సవిస్తార చారిత్రికేతిహాసము" (క్రీ॥ శ॥ 1224 నుండి క్రీ॥ శ॥ 1656 వరకు గల చరిత్ర) ఆంధ్ర పాఠకలోకమునకు, లోగడ ఏ యితర రచయితలవల్లగాని అందించబడనట్టి సంపూర్ణమైన యితివృత్తముగా, బహుళమైన కృషిచేసి విద్యానగర చారిత్రక నవలా మాలిక యను పేర 20 సంపుటములుగా (దాదాపు 6 వేల పుటలలో) మనకు సంతరించి యిచ్చిన రచయితలు "శ్రీనివాసపురం సోదరులు" వీరు వరుసగా 1. కవిరాజ్, డాక్టరు శ్రీనివాసపురం శేషాచార్యులు 2. కవిరాజ్, డాక్టర్ శ్రీనివాసపురం నరసింహాచార్యులు 3. శ్రీనివాసపురం వేంకట లక్ష్మినారాయణ్ 4. శ్రీనివాసపురం అనంతాచార్యులు 5. శ్రీనివాసపురం రామాచార్యులు అను పేరుగల ఈ శ్రీనివాసపురం సోదరపంచకము రాయలసీమ

లోని స్వయంప్రభా రత్నములు. వీరిని, వీరి రచనలను గూర్చి తెలుసుకొనుట సాహిత్య, పిపాసువులకు ఎంతేని అవసరము.

"శ్రీనివాసపురం సోదరులు" అను సమిష్టి నామముతో ఆంధ్ర పాఠకలోకమునకు పరిచితులైన, ఈ రచయితలు చిత్తూరు జిల్లాలోని పలమనేరు తాలూకా, పెంగరకుంట గ్రామ వాస్తవ్యులు. వీరి తండ్రిగారైన బ్రహ్మశ్రీ, శ్రీమాన్ శ్రీనివాసపురం కృష్ణమాచార్యులవారు - ఆయుర్వేద విద్యాపారంగతులు. ఆధ్యాత్మిక చింతనాపరులైన శ్రీవైష్ణవులు. ఆయుర్వేద వైద్యము వీరి కుటుంబమునకు వంశ పారంపర్యముగా అబ్బినది. కృష్ణమాచార్యుల వారికి 11 మంది సంతానము. అందులో ఏడుగురు కుమారులు. వరుసగా మొదటి ఐదుమంది "శ్రీనివాసపురం సోదరులు" గా వాసికెక్కారి.

## శ్రీనివాసపురం శేషాచార్యులు

శ్రీనివాసపురం సోదరులలో వీరు జ్యేష్ఠులు. కలం పేరు "శటశ్రీ". 1921లో జననము. వృత్తి ఆయుర్వేద వైద్యంలో డాక్టరు.

1941నుండి సారస్వతకృషి. 1943లో భారతరాజకీయాల్లో ప్రవేశము. భారత జాతీయ కాంగ్రెస్‌లో 'క్రియాశీల' సభ్యులు. ప్రకాశంపంతులుగారి అనుయాయులు. కాంగ్రెస్‌వాది. స్వాతం

త్ర్యము లభించిన తరువాత "ఆంధ్రరాష్ట్రసాధన" కలగా మిగిలి పోయినప్పుడు వీరు 'శుభశ్రీ' కలంపేరుతో నిశితమైన రాజకీయ విమర్శలు, వ్యాసాలు, గేయాలు వ్రాసి ఆంధ్రప్రజల్లో రాజకీయ చైతన్య భావాలు రేకెత్తించిన వైతాళికులు. 1917-18 ప్రాంతంలో వీరి రచనలనేకము ఆనాటి పత్రికలలో ప్రచురించబడినవి. ముఖ్యంగా వీరి కలం గేయ, వ్యాస రచనలకే పరిమితమైనది. శ్రీశ్రీ పోకడ వీరి కవిత్వంలో చాలావరకు కనిపించును. 1954లో పుంగనూరు నుండి వెలువడుచున్న 'నవీన' మాసపత్రికకు సంపాదకత్వము వహించిరి. 1955వ సం॥లో సంపూర్ణ విజయ నగర సామ్రాజ్య చారిత్రికేతిహాస రచనకు ప్రారంభించిరి. అట్లు వ్రాయబూనిన 'విద్యానగర చారిత్రిక నవలామాలిక' లోని 20 సంపుటములలో రాజద్రోహి - శాంతివాది - పిచ్చిప్రభువు అను మూడు సంపుటములు వీరు రచించిరి.

1964వ సం॥ ఫిబ్రవరి నెలలో అనంతపురం జిల్లా పెను కొండలో జరిగిన శ్రీకృష్ణదేవరాయ వర్ధంతి రజతోత్సవ సంద ర్భంగా డా॥ శేషాచార్యులుగారు తమ్ములతోసహా సత్కరింపబడిరి.

శ్రీమాన్ మాడభూషి అనంతశయనం అయ్యంగార్ వారు బీహార్ గవర్నరుగా నుండిన కాలంలో వారికి, గౌరవ స్వకీయ ఆయుర్వేద వైద్యులుగా శేషాచార్యులు కొంతకాలం నియమితులై యుండిరి. చిత్తూరు జిల్లా రచయితల సహకార ప్రచురణల

సొసైటీకి వీరు డైరెక్టరుగా నియమింపబడిరి. వీరు సోదరులతో కలిసి సాహితీక్షేత్రమున మరింత వ్యవసాయమొనర్చి చక్కని సస్యములు పండింతురుగాక!

## శ్రీనివాసపురం నరసింహాచార్యులు

శ్రీనివాసపురం సోదరులలో వీరు ద్వితీయులు. వీరి కలం పేరు 'సింహశ్రీ'. జననము 13-1-1927. వృత్తివైద్యము.

1948 సం॥ నుండి తీరిక సమయములందు పద్య, గేయ వ్యాస, విమర్శనాత్మకమగు సాహిత్యకృషిని ప్రారంభించిరి. విద్యార్థిదశ నుండి ప్రాచీన కావ్యాలు, ప్రబంధాలు ఆసక్తిగా చదివేవారు. కనబడిన ప్రతిగ్రంథము చదువుట వీరికున్న ఒక మంచి అలవాటు. "రాధిక, తెనుగుబిడ్డ, భగ్న హృదయము, రసార్ద్రము, చరమసంధ్య" మొదలగునవి వీరి ఖండకావ్యములు. వీరి అనేకరచనలు త్రిలింగ-హితవాది-చిత్రగుప్త-పల్లెసీమ-భారతి ఆంధ్రపత్రిక-ఆంధ్రప్రభలలో ప్రచురింపబడినవి. చిన్ననాడే వీరు "కవికిశోర"మని పిలువబడిరి. 1960 లో ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో "తెలుగుకలాలు" శీర్షికలో వీరినిగూర్చి వ్రాయబడినది.

హైందవ చారిత్రక విషయములతో వీరికి విశేషమైన ప్రజ్ఞగలదు. 1964 జనవరి - మార్చి నెలల "భారతి" మాస

పత్రికలో ప్రచురింపబడిన "రాజావళి చరిత్ర ఈనాటిది కాదు" "రాజావళి" చరిత్ర మరికొన్ని విశేషములు - వీరి ఎన్నదగిన పరిశోధనా వ్యాసములు. "అక్షయ భారత విజ్ఞానము" అను వొక బృహన్నిఘంటు నిర్మాణమునకు పూనుకొన్న సాహిత్య సాధకు డీయన.

సోదరులతో కలిసి వ్రాసిన విజయనగర నవలామాలిక లోని "దేవగిరిదుర్గం, రాజ్యోదయము, రాజ్యక్రాంతి, నాగలా దేవి, రఘునాథవిజయము" అను నైదు సంపుటములకు వీరు ప్రధాన సంపాదకులు.

"వైద్యము ప్రధానజీవికగా, బ్రతుకుబాటలో భవిష్యత్తుకై సాగే పోరాటములో, కాలముతో కలిసి రాజీకిరాని గడుసరి. ఆత్మాభిమాని. శాస్త్రచక్షువు, వ్యాసకర్త-కావ్యప్రియుడు" మన నరసింహాచార్యులు.

## శ్రీనివాసపురం వేంకట లక్ష్మీనారాయణన్

శ్రీనివాసపురం సోదరులలో వీరు మూడవవారు. జననం 1929. కలంపేర్లు "రమాకాంత్" - "పద్మావతీ నారాయణన్" ఉద్యోగం చేసింది రైల్వేశాఖలో. వీరికి గద్యరచనపై మక్కువ మెండు. ఆధునిక రచయితల రచనలను, దీక్షతో చదివి బాగుగా

ఆకళింపు జేసుకొన్నవారు వీరు. వీరి రచన లనేకము పత్రికలలో ప్రచురించబడినవి. వీరు కథారచనలో సిద్ధహస్తులు.

అన్నదమ్ములతో కలసి చేసిన విజయనగర సామ్రాజ్య చారిత్రికేతిహాస రచనాకృషిలో వీరు "దేవగిరి పతనము, రాయల పరాభవము, దివికోట" అను సంపుటములకు వీరు సంచాలకులు.

వంశానుక్రమముగా వచ్చుచున్న "సాహిత్య వారసత్వపు కన్య'తనకుతానై వీరిని వరించిందనడంలో ఎట్టిసందేహము లేదు.

## శ్రీనివాసపురం అనంతాచార్యులు

ఈ సోదర పంచకములో వీరు నాల్గవవారు. జననము 1932లో. కలంపేరు "అనంతశ్రీ". ఉద్యోగం చేసింది భారత సైనిక తపాలాశాఖలో. స్వయంకృషితో సాహిత్యము నలవరచు కొనిరి. వీరి కవిత్వము స్వామి శివశంకరశాస్త్రి-వేలూరి శివరామశాస్త్రి వంటి పెద్దల నాకర్షించినది. వీరి "శ్రీహర్ష-శ్రీనాథుల స్వర్గ సమావేశము" - "సంయుక్తా స్వయంవరం" నాటికలు చాల ప్రాముఖ్యత నందినవి. వీరి వ్యాస రచనలలోకెల్ల "కాళిదాసుని లోకయాత్రా పరిశీలనము" ప్రధానమైనది. వీరు అనువాదకర్తలు కూడా. శ్రీ భాసమహాకవి కృత "కర్ణభారము" నకు "ప్రతిజ్ఞా నిర్వహణము" వీరి స్వేచ్ఛానువాద కృతి.

సోదరులతో కలిసి వీరు "విజయనగర నవలామాలిక" లోని కంపిలరాయలు, సమ్రాట్ ప్రౌఢదేవరాయలు, రాక్షసి-తంగడి, రాజ్యక్షయము" అను పొత్తములు వీరి సంపాదకత్వమున వెలువడినవి.

"మానవసేవయే మాధవసేవ"గా తలచి వీరు వంశ సాంప్రదాయ సిద్ధమగు వైద్యవృత్తిని పూని జీవయాత్ర సాగిస్తున్నారు.

## శ్రీనివాసపురం రామాచార్యులు

ఈ సోదరపంచకములో వీరు ఐదవవారు. జననం 1935. కలంపేరు "రమ్యశ్రీ". తంతి తపాలాశాఖలో ఉద్యోగం చేసిరి. వీరు తమ 15వ ఏటనే కథారచనను ప్రారంభించిరి. వీరిది ఆవేశ పూరిత హృదయము. రచనాశైలి సరళముగా నుండి సునిశిత మైన హాస్యము మిళితమై చమత్కారముగా వ్రాయుట వీరికిగల నేర్పు. వీరికి వచనరచనమీద మక్కువ మెండు. వీరు వందకు పైగా కథలువ్రాసిరి. అన్నిపత్రికలలోను అవి వెలుగుచూచినవి.

సోదరులు తలపెట్టిన "విజయనగర నవలా మాలిక" రచనా కార్యక్రమములో వీరిరచన నాంది పలికినది. ఆ నవలా మాలికలోని 11వ సంపుటమైన "జగన్మోహిని"ని వీరు తొలుత

ఆంధ్ర పాఠకలోకమునకు అందించిరి. ఈ నవలల భాషాంతరీకరణకు వీరు ప్రధానకర్తలు. ఈ సంపుటములలోని మరికొన్ని భాగములగు "కుమారరాముడు, తౌళవేశ్వరుడు, అమాత్య రత్నము, జ్ఞాతికలహము" లకు వీరు ప్రధాన సంచాలకులు. "ప్రణయబంధము-మీరాబాయి-కన్నీటికడలి" వీరి మరికొన్ని నవలలు. తండ్రివద్ద అంతేవాసిగా మెలగి 15 ఏండ్లు ఆయుర్వేద వైద్యమును నేర్చి-ప్రభుత్వ పట్టముపొంది, ఆంధ్ర ప్రభుత్వంలో అర్హతగల వైద్యులుగా గుర్తింపబడిరి.

## విద్యానగర నవలామాలిక

ఈ సోదర పంచకముచే రచింపబడిన, ఈ సంపూర్ణ విజయనగర సామ్రాజ్యేతిహాసము 20 సంపుటములు. క్రీ॥ శ॥ 1224 నుండి క్రీ॥ శ॥ 1656 వరకు గల చరిత్ర యిది. ఇందలి మొదటి ఐదు భాగములు విజయనగర సామ్రాజ్యోదయ ఘట్టమును (1224 నుండి 1336) వివరించు నవలలు. అవి 1) దేవగిరి దుర్గము 2) దేవగిరి పతనము 3) కంపిలరాయలు 4) కుమారరాముడు 5) రాజ్యోదయము.

6 నుండి 12 భాగములు సామ్రాజ్య వైభవ ఘట్టముల (1336-1528) ను విశదపరచు నవలలు. అవి 6) రాయపరాభవము 7) సమ్రాట్ ప్రౌఢ దేవరాయలు 8) రాజ్యక్రాంతి

9) తౌళవేశ్వరుడు 10) నాగలాదేవి 11) జగన్మోహిని 12) శాంతివాది.

13 నుండి 15 భాగములు "సామ్రాజ్య దురంతఘట్టము" (1528-1565) లను తెలుపు నవలలు. అవి 13) రాజద్రోహి 14) అమాత్యరత్నము 15) పిచ్చిప్రభువు 16) రాక్షసి-తంగడి.

17 నుండి 20 భాగములు "సామ్రాజ్య పతనఘట్టము" (1565-1656) వరకు వ్రాయబడిన సంపుటములు. అవి 17) రఘునాథవిజయము 18) దీవికోట 19) జ్ఞాతికలహము 20) రాజ్యక్షయము.

ఈ నవలా మాలికకు, శ్రీ కొరటి శ్రీనివాసరావు గారు రచించిన కన్నడ నవలలు మూలము. కాని, ఈ సోదరపంచకము మూలమున లేని అమూల్యములగు అంశములతో, మూలమును మించిన, జిగిబిగితో వీరి రచనలు నొప్పారుచున్నట్లు ప్రముఖ సాహితీవేత్తలు-పరిశోధనాకర్తలు ప్రశంసించిరి. బీహార్ గవర్నరుగా నుండిన శ్రీమాన్ మాడభూషి అనంతశయనం అయ్యంగారు వీరి పుస్తకాలను గూర్చి వ్రాసిన అభిప్రాయ మిట్లున్నది. "డా॥ శేషాచార్లు-వీరి సోదరులు నల్వురు,కూడా వీరితో సమానముగా రచనా వ్యాసంగంలో కృషిసల్పినారు. వీరందరూ కలిసి వ్రాసిననూ, ఈ సాహిత్యం ఏక కంఠంతో వినిపించినట్లున్నది.

శ్రీనివాసపురం సోదరపంచకము, మిక్కిలిగా శ్రమించి జీవితము నర్థంచేసికొని, బ్రతుకుతో రాజీపడి, కాలంతోకఱిసి మనకు సంత రించియిచ్చిన ఈ "విజయనగర సామ్రాజ్య చారిత్రిక నవలా సంపుటిని తెలుగు పాఠకలోకం సహృదయంతో ఆదరించగలదని విశ్వసిస్తున్నాను".

ఈ సోదరపంచకము ఈ కృషి తరువాత కలసి సాగించిన కృషి మరొకటేదియులేదని తెలియుచున్నది. ఈ రచనాయజ్ఞ మును బహుప్రయాసలకోర్చి పరిసమాప్తి గావించిన ఈ సోద రులకు ఆంధ్రులెంతయో, ఋణపడి వున్నారు. 1968 తరువాత ఈ నవలలు మరలా పునర్ముద్రింపబడలేదని తెలియుచున్నది. ఇవి పునర్ముద్రింపబడినచో అది ఆంధ్రుల మహద్భాగ్యముగా నెంచవచ్చును. ఈ సోదరులకు శారదామాత ఆయురారోగ్య భాగ్యము లొసంగుగాత!





## శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావు

జననము:
22-3-1907;

జన్మస్థలం:
విజయనగరం.

తల్లి: శ్రీమతి విశాలాక్షి; తండ్రి: టేకుమళ్ళ అచ్యుతరావు
ప్రస్తుత నివాసము: చిత్తూరు. (ఆంధ్రప్రదేశ్)

ఆంధ్ర వాఙ్మయ విమర్శకులు, బహు గ్రంథకర్తలైన శ్రీ టేకుమళ్ళ అచ్యుతరావుగారి పేరెరుగని ఆంధ్రు లుండరు. వీరు రచించిన "విజయనగరాంధ్ర వాఙ్మయచరిత్ర, ఆంగ్లములో "పింగళి సూరన జీవితము - సాహిత్య విమర్శ" ప్రసిద్ధములైనవి. వీరి జ్యేష్ఠ పుత్రుడే టేకుమళ్ళ కామేశ్వరరావు.

కామేశ్వరరావు గారికి చిన్నప్పటి నుండి కవిత్వమల్లుట అభ్యాసమైనది. బళ్ళారిలో చదువు చున్నప్పుడే కవిత్వ లక్షణ గ్రంథములను చదువుచుండిరి. 1927లో వీరికి వివాహమైనది. 1933 నాటికి ఉపాధ్యాయవృత్తిలో ప్రవేశించి, తదుపరి స్కూళ్ళ ఇన్‌స్పెక్టరుగా రాయలసీమ, ఉత్తర సర్కారు జిల్లాలలో పని చేసిరి.

1935లో వీరు కళత్రవియోగము జెందిరి. ఆ సంవత్సరమే వారికి ద్వితీయ వివాహము జరిగినది. ఆమె పేరు హనుమా యమ్మ. అవిడ ఒక మహాయోగిని. ఆధ్యాత్మిక శక్తి కలది. ఆమె ఆధ్యాత్మికశక్తిని గూర్చి కామేశ్వరరావుగారు పరిశోధన గావించి ఆంగ్లములో "**Further life of the Soul**" అను పుస్తకమును వ్రాసి ముద్రించిరి.

కామేశ్వరరావు గారు అచ్చువేసిన మొదటి పుస్తకము "కలువలు"-1933లో. అదియొక చక్కని ఖండ కావ్య సంపుటి. రాజమండ్రిలో వున్నప్పుడు "కోపదారిమొగుడు" అను ఐదంకముల నాటకమును వ్రాసి 1937లో ప్రచురించిరి. వాడుకభాష పేర కొందరు రచయితలు నోటికి వచ్చినట్లు వ్రాయుచుండుట చూచి దానికి కొన్ని నియమములు అవసరమని తలచి "వాడుక భాషా-రచన-కొన్ని నియమములు" అను గ్రంథమును రచించి మార్గదర్శకులైరి.

వీరు వ్యవహారిక భాషతో వ్రాసిన చక్కటి కథలు, ఆనాటి వివిధ తెనుగు పత్రికలలో ప్రచురింపబడినది. "రాజా" "జానకిప్రేమ" - వీరి కథల సంపుటులు. వీరి "రాజా" కథను చదివిన రావుసాహేబ్ శ్రీ గిడుగు వెంకటరామమూర్తి పంతులు గారు "నేను భాషలో ఇంతకృషి చేశాను; ఎందుకూ? ఇటువంటి

కథ ఒక్కటి రాసి వుంటే ఎంత బాగుండును?" అని మెచ్చు కొన్నారు.

పిల్లలకోసం వీరు వచన కవిత్వం వ్రాసి "మిణుగురు పురుగు"-"పాలపిట్ట" అను పేర్లతో చిన్న పుస్తకములను ప్రచు రించిరి. "పసివానికీ చిన్నచిన్న సమస్యలున్నాయి. వాటిని విడ దీసి చక్కగా అతని కర్థమయ్యేటట్టూ, అతనికానందం కలిగించే టట్టూ చెప్పాలి. అతని విజ్ఞానావరణాన్ని విశాలం చెయ్యాలి. అతనికి, తన చుట్టూను కనిపిస్తూన్న ప్రకృతినీ, తనలోని ప్రకృతినీ తెలుసుకొని ఆనందించడం నేర్పాలి. అందుకు బాలు రకు ప్రత్యేక సాహిత్యం కావాలి. ఆ కృషి శ్రీ కామేశ్వరరావు గారు చేశారు. బాలుర మనస్తత్వాలను పరిశీలించి దాని కనువ యేటట్లు వ్రాయడం వారి ఆదర్శం." - అని బాలసాహిత్యము నందు కృషి గావించి పేరెన్నికగన్న శ్రీ బి. వి. సింగరాచార్య "మిణుగురు పురుగు"కు వ్రాసిన తొలిమాటలో ప్రస్తావించిరి. మచ్చుకు అందలి ఒక చిన్న గేయము.

కా లా లు

వేసం కాలంలో ఎండకి - వేగిపోయాము
వర్షాలెప్పుడు దిగుతాయో?
వర్షాకాలంలో వానకి - వణికిపోయాము
చలిగాలెప్పుడు తిరుగుతుందో?

శీతాకాలంలో చలికి - బిగిసిపోయాము
ఎండలు ఎప్పుడుకాస్తాయో! ("మిణుగురుపురుగు")

శ్రీ కామేశ్వరరావుకు చిన్నతనం నుండి కవుల చరిత్రలు చదవడమన్న చాలాసరదా. ఆయన గురుజాడ శ్రీ రామమూర్తి కందుకూరి వారలు వ్రాసిన కవుల చరిత్రలు బాగుగా చదివినారు. విసుగులేకుండా కందుకూరి వారి "ఆంధ్రకవుల చరిత్ర" తిరగ వేసినారు. అందలి శైలి వారికి హద్దులేని ఆనందము నిచ్చింది. అప్పటినుండి వీరికి తెలుగుకవుల జీవితములను సేకరించవలె ననెడి పట్టుదల కలిగి 1932 ప్రాంతంలో భోగట్టాలను సేకరించు టకు ప్రారంభించిరి. "కవుల చరిత్రయొక్క అవసరమేమిటి?" అని పలువురు వీరిని ప్రశ్నించినప్పుడు వీరు "ఒక మహాకవిని అర్థం చేసుకోవాలంటే, అతనియొక్క జీవితచరిత్ర అత్యవసరం" అని వాదించెడివారు. వీరు కవుల చరిత్రసేకరణ గావించు సమ యమున సుప్రసిద్ధ కథకులైన శ్రీ పాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారి జీవితచరిత్రను వ్రాయతలపెట్టి అంశములకొరకు వారికి వ్రాయగా ఆయన "మీరు ముఖ్యస్నేహితులు కాబట్టి దాచకుండా చెప్తు తున్నాను. మరొకరైతే చెప్పను. మీరు ఇంకొకరి చరిత్రవ్రాస్తే మీకీర్తి తగ్గిపోతుంది. వారికీర్తి ఎక్కువవుతుంది. కాబట్టి అట్టి ప్రయత్నం మానుకోండి" అని నిరుత్సాహ పరచడానికి ప్రయ త్నించగా, దానిని కామేశ్వరరావు - మంచి హృదయముతో

చెప్పినదే యైననూ, పాతకాలపు దురభిప్రాయంగా భావించి, దాని నొక "వాఙ్మయసేవ"గా లెక్కించిరి.

ఈ కవుల చరిత్ర సేకరణలో వీరు పొందిన అనుభవము అంతా యింతా కాదు. నాటికి నేటికి కవుల స్వభావమొక్కటే. జాబులతో అంతగా ప్రయోజనము లేదనుకొని కవుల భోగట్టా కొరకు దేశసంచారము కూడా సాగించిరి. ఇట్లైనన్నో కష్టముల కోర్చి తుదకు 19-20 శతాబ్దములందలి 102 మంది ఆధునిక కవులను గూర్చి "నా వాఙ్మయమిత్రులు" అను పేర 350 పుటల ఒక పెద్ద పుస్తకముగా ప్రచురించి వాఙ్మయసేవ గావించిన సాహిత్యోపాసకులు వీరు.

1970 లో "పూర్వాంధ్రకవులు" అను మరియొక కవుల చరిత్రను మొదటిభాగముగా క్రీ॥ శ॥ 630-945 వరకు గల జయదేవుడు, వేమన, రేచన, నన్నెచోడుడు, పంపకవి మొదలగు కవులను గూర్చి వ్రాసి ప్రచురించిరి. మిగుల శ్రమపడి "తెలంగాణా రాజుల చరిత్ర" లను నాలుగింటిని పెద్ద నాటకములుగా వ్రాసిరి. అవి అచ్చుకాలేదు. వీరి "ప్రకాశ విమర్శీయము" అను ఐదంకముల నాటకము, హిందూ-బౌద్ధమత విభిన్న లక్షణములను తెలియజేయు మతపరమైన ఒక హాస్యనాటిక. విమర్శాదేవి, ప్రకాశమూర్తి అనువారు ఇందలి నాయికానాయకులు. ఈ నాటకము రంగస్థలముపై ప్రదర్శించుటకు యోగ్యమైనదికాదు.

చదువరులను మాత్రము ఆలోచింప జేయుననుట వాస్తవము.

తదుపరి వీరి సాహిత్యకృషి "జానపద గేయ వాఙ్మయ చరిత్ర" - "పూర్వపదాలు-పాతపాటల" పై సాగినది. పెక్కు జంగం కథలను సేకరించి వాటిపై పరిశోధన గావించి విమర్శ నాత్మకముగా విపులమైన వ్యాసములు వ్రాసి ఆనాటి గృహలక్ష్మి సౌభాగ్య-కిన్నెర పత్రికలలో వరసగా ప్రచురించిరి. ఆ వ్యాస ములను ఒక పుస్తకరూపమున దెచ్చి జానపదగేయవాఙ్మయము నకు అలంకారము తెచ్చిరి.

కవిగారు మొదటినుండి దైవభక్తిపరులు. జప తపము లతో కాలము గడుపుచూ, కవులతోనే కాక యోగులతోను స్నేహము నెఱపిరి. ఈ జపతపములు ముదిరి, చివరకు 1943 లో దైవ సాక్షాత్కారమును పొందిరి. ఆధ్యాత్మిక శక్తిగల భార్య తోడుకాగ మరింత భక్తిజ్ఞాన యోగము ముదిరినది. సంతానము దక్కలేదు. దానికితోడు భార్య అనారోగ్యము. ఆమె కూడా తన 72 వ ఏట కన్నుమూసింది. కవిగారు ఏకాకిగా మిగిలిరి.

తుదకు చిత్తూరులో గృహ నిర్మాణము గావించుకొని కాలము గడుపుచున్న సమయములో ఇంటివద్ద ఎవరో ఒక ఆడశిశువును కని పారవేయగా దానిని భగవదాజ్ఞగా నెంచి

ఆ శిశువును తెచ్చి సంరక్షింతు పూనుకొనిరి. (కవిగారు ఆ అమ్మాయితో తీయించుకొన్న ఫోటోను చూడవచ్చును) ఆ బిడ్డ బాధ్యత కవిగారి మీద పడినది. ఆ బిడ్డ "పరమేశ్వరియే కాని వేరు కాదు" అని తలచి పెంచుకొనుచున్నారు.

"నా శరీరము రోగ నిలయ మయినది. ఇట్టి స్థితిలో ఎట్లో పాటుపడి నా ప్రియమైన కుమార్తెను పెంచుచున్నాను. భగవంతుడు ముందేమి చేయునో నాకు తెలియదు. ఈ ఎనభై ఏండ్ల వయసులో ఇప్పుడింక క్రొత్త వ్రాతలు అసాధ్యము. జీవితము ఎట్లు ముగియునో అగోచరము. వాని లీలలు మనకు తెలియుననుకొనుట అవివేకము" అని శ్రీ కామేశ్వరరావుగారు ఒక ఉత్తరమున వ్రాసిరి.

ఇట్టి వాఙ్మయమూర్తిని భగవంతుడు ఆయురారోగ్యములతో కాపాడుగాక!





# డా॥ ఎస్. గంగప్ప

జననము: 8-11-1936

తల్లి: శ్రీమతి కృష్ణమ్మ

తండ్రి: వెంకటప్ప

జన్మస్థలము:

నల్లగొండ్రాయనిపల్లి

పెనుకొండ తా॥

అనంతపురం జిల్లా.

జనపదములో పుట్టిపెరిగిన గంగప్ప గారికి బాల్యము నుండియే జానపద గీతములపై ఒక ప్రత్యేకమైన అభిమాన మేర్పడినది. అందునా రాయలసీమ రైతుల, కూలీల కష్టనష్ట ములను బాగుగా తెలుసుకొన్న సామాన్య రైతు కుటుంబీకుడు గంగప్ప. పెనుకొండ చుట్టుముట్టుగల పల్లెలలో జానపదులు పాడుకొను కపిల పాటలను, విసర్రాయి పాటలను, వడ్లు దంచు పాటలను, కలుపులు, కోతలప్పుడు పాడు పాటలను చిన్నతనము నుండియే ఆసక్తిగా వింటూ సేకరించు ఉత్సాహమును కలిగి వుండిరి. ఈ జానపద విజ్ఞాన మొక అపారమైన ఖని యని భావించి త్రవ్వితీయు ప్రయత్నములో మునిగితేలిన శ్రామికులు వీరు. "కష్టేఫలి అని నమ్మి ఆరుగాలమూ పాటుపడుతున్న కృషి పండితు డీతడు".

గంగప్పగారి ప్రాథమిక విద్య సోమందేపల్లి లోను,

ఉన్నతపాఠశాల విద్యాభ్యాసము పెనుకొండలోను, ముగించి తదుపరి అనంతపురం ప్రభుత్వ కళాశాలలో బి. ఏ ఆనర్సు; ఆంధ్ర విశ్వకళా పరిషత్తు, వాల్తేరులో ఎం. ఏ., పూర్తి గావించిరి. ఆనర్సులో వీరి అభిమాన విషయము భాషాశాస్త్రము. పూనా వేసవి పాఠశాలలో భాషా శాస్త్రాధ్యయన ప్రొఫెసర్ లీలిస్కర్ వంటి మహా విద్వాంసుల సన్నిధిలో భాషాధ్యయనము గావించారు. కాని వీరికి సాహిత్యము పైననే అభిమానము మెండు. అందులోనే అధికకృషి గావించిరి. కళాశాల అధ్యాపక వృత్తి కొనసాగించుచూ ప్రవేటుగా పరిశోధన విద్యార్థిగా "శ్రీ కోలాచలం శ్రీనివాసరావు-నాటక సాహిత్య సమాలోచనము" అను అంశముపై పరిశోధన గావించి "డాక్టరేట్" సంపాదించిరి.

తదుపరి వీరి మరియొక పరిశోధనా గ్రంథము "క్షేత్రయ్య పద సాహిత్యము". దీనికి ఆం. ప్ర. సాహిత్య అకాడమీ వారి అవార్డు కూడా లభించినది. "పదకవితా సమీక్షాక్షేత్రంలో చాల కాలంగా పరిశ్రమిస్తున్న వ్యవసాయికులలో డాక్టర్ ఎన్. గంగప్ప మొదటి మునుముకు చెందిన వ్యక్తి" గా ఆచార్య తూమాటి దోణప్పగారు అభివర్ణించిరి. క్షేత్రయ్య తరువాత "వీరు సారంగపాణి పదసాహిత్యము"ను వెలుగులోనికి దెచ్చిరి. ప్రసిద్ధి గాంచిన వాగ్గేయకారులలో సారంగపాణి కూడా ఒకడు. ఇతడు చిత్తూరు జిల్లాకు చెందిన కార్వేటినగర సంస్థానమున నుండినవాడు.

అన్నమయ్య, క్షేత్రయ్యలవలె జగమెరిగినవాడు కాడు. ఒక అజ్ఞాత వాగ్గేయకారు డతడు. కార్వేటి నగరములోని ఒక సాహితీ సంస్థ ఆ వాగ్గేయకారుని పదసాహిత్యమును వ్యాప్తి లోనికి తెచ్చుటకు పూనుకొన్నది. ఆ సమయములోనే గంగప్ప గారి క్షేత్రయ్య పదసాహిత్య గ్రంథము వెలువడుట జరిగినది. ఈ విషయం తెలుసుకొనిన శ్రీ విశ్వనాథ అరుణాచలం గారు గంగప్పగారి నీవిషయముగా ప్రస్తావించిరి. గంగప్పగారు పట్టిన పట్టు విడువక సారంగపాణి పదసాహిత్యమును పరిశోధన గావించి ఒక గ్రంథముగా వెలువరించిరి. ఆయన కృషి ఫలిత ముగా "సారంగపాణి పదసాహిత్యము" వెలుగు చూచు భాగ్య మబ్బినది.

పై రెండు పదసాహిత్యముల కృషి ఫలితముగా భారత ప్రభుత్వ-కేంద్ర సాంస్కృతిక వ్యవహారాలశాఖ వీరికి "సీనియర్ ఫెలోషిప్" ఇచ్చి "అన్నమాచార్యులు - ఇతర ప్రముఖ వాగ్గేయ కారులు-తులనాత్మక అధ్యయనం" అను అంశముపై పరిశోధన గావించుటకు ఏర్పాటు చేయబడిన 15 మంది భారతీయ పరి శోధకులలో వీరికి మూడవస్థాన మిచ్చిరి. ఈ గ్రంథము వెలు వడిన ఒక అమూల్య గ్రంథముగా పరిగణింపబడగలదు.

ఈ ముగ్గురు వాగ్గేయకారుల పదసాహిత్యమును పరిశోధన గావించిన అనుభవజ్ఞులగుటచే వీరు "తెలుగులో పద కవిత"

అనబడు గ్రంథమును రచించి 1980 - 81లో ఆం.ప్ర. సాహిత్య అకాడమీ అవార్డు పొందిరి. ఇందు వివిధ భారతీయ భాషలలో పద కవిత ఆవిర్భావము - వికాసము; పదకవుల చరిత్ర - పద కవితావైభవం - పదకవితలోని భాషా విశేషాలు - పద కవితలో శృంగార, భక్తి నీతి వైరాగ్యములు, మున్నగు అనేక విషయములను గూర్చి విపులముగా చర్చించిన గ్రంథమిది. తెలుగు సాహిత్యములో ఈ పరిశోధనా గ్రంథమునకు ఒక ఉన్నత స్థానము లభించగలదు.

పదసాహిత్యము తరువాత వీరి జానపద సాహిత్య కృషి మెచ్చదగిన అంశము. వీరు సేకరించిన "తెలుగుదేశపు జానపద గీతాల"ను ఆం.ప్ర. సమాచార పౌర సంబంధశాఖవారు ప్రచురణ గావించిరి. తదుపరి జానపదులు పాడుకొనే రామాయణ సంబంధ గేయముల నన్నింటిని సేకరించి "జానపద గేయ రామాయణ" ముగా ముద్రించిరి. జానపద సాహిత్యముపై వీరు పెక్కు వ్యాసములు వ్రాసి "జాతికి ప్రతిబింబం జానపద సాహిత్యం" పేర పుస్తక రూపములో ముద్రించిరి.

పద-జానపద సాహిత్యకృషి తరువాత తెలుగు ప్రబంధ, ఆధునిక భాషా సాహిత్యములపై పెక్కు విమర్శనాత్మకమైన వ్యాసములను రచించిరి. వాటిని కొన్ని వ్యాస సంపుటములుగా ముద్రించిరి. ఆ వ్యాస సంపుటము లివి-సాహిత్యసుధ, ఉన్నవ

లక్ష్మీనారాయణ సాహిత్య జీవితం, సాహిత్యోపన్యాసములు, భాషా వ్యాసాలు; తెలుగు నాటకం - ఆరంభం నుండి అబ్సర్డు నాటకాల దాక. విశ్వనాథవారి వేయి పడగలు - విశ్లేషణాత్మక విమర్శ- శ్రీ విశ్వనాథవారి నాటకాలు - విశ్లేషణ. ఈ విమర్శనాత్మక వ్యాసావళులేకాక చిన్నకథలు, కవితలు, నాటికలు; బాలసాహిత్యము, 8; 9, 10 తరగతులకు తెలుగు ఉపవాచకములు, నవలలు, వయోజనవిద్య పుస్తకములు మిక్కుటముగా ప్రచురించిరి. వీరు తెలుగు సాహిత్యములో చేపట్టని ప్రక్రియలేదు. ఈయన విరామ మెరుగ నిరచయిత. ఈయన చేపట్టినది సాహిత్యవ్రతం. "తన ప్రతి రచన వెలుగులోనికి రావాలని ఉబలాటపడే స్వభావం వీరిది."

"ఒక రకంగా చూస్తే మన గంగప్పకూడా వ్యసనపరుడని చెప్పక తప్పదు. నిరంతర గవేషణా ప్రియత్వము, సత్యతత్త్వావిష్కరణ తత్పరత్వము, సద్గ్రంథ ప్రచురణ చణత్వము దా॥ గంగప్పను ముప్పేటగా ముసురుకొన్న వ్యసనాలు. ఇవి ఎవరికీ హాని చేకూర్చక పోవడమేగాక ఒక జాతి సంస్కృతి ప్రగతికి కొంతలో కొంత దోహదం చేస్తాయి కాబట్టి వీటిని సద్వ్యసనాల క్రింద జమకట్టుకోక తీరదు." అని శ్రీ తూమాటి దొణప్పగారు వక్కాణించారు.

ప్రస్తుతము ఎన్. గంగప్పగారు, గుంటూరు జిల్లాలోని

నాగార్జున విశ్వవిద్యాలయ తెలుగుశాఖలో తెలుగు రీడర్‌గా పని చేయుచున్నారు. వీరు రాష్ట్రంలోను; జాతీయ స్థాయిలోను; అంతర్జాతీయ స్థాయిలోను జరిగిన పెక్కు సదస్సులు; గోష్ఠులు, చర్చలలో అనేక పర్యాయములు ప్రభుత్వపక్షాన, విశ్వవిద్యాలయం పక్షాన పాల్గొని అనేక అంశములు చర్చలు జరిపి; పండిత ప్రశంసలకు పాత్రులైరి:

డా॥ గంగప్పగారు తమ ఐదుపదుల వయస్సుకె ఎనలేని సాహిత్యకృషి గావించి; ఆంధ్రదేశమున వాసికెక్కిరి: వీరింకనూ శతాధిక గ్రంథకర్తలై సహస్రాధిక పరిశోధనా విద్యార్థులు వీరి చేతిమీదుగా తయారు కాగలరని ఆశింతముగాక!

---



## తిరుమల రామచంద్ర

జననము: 17-6-1913

తల్లి: శ్రీమతి జానకమ్మ

తండ్రి: శ్రీ శేషాచార్యులు

జన్మస్థలము: రాఘవమ్మపల్లె,
ధర్మవరం తాలూకా
అనంతపురం జిల్లా:

సుప్రసిద్ధ పత్రికా రచయితలు, రచయిత, భాషాచరిత్ర పరిశోధకులైన శ్రీ తిరుమల రామచంద్రగారి పేరెరుగని తెలుగు వారుండరు. ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకులకు వీరు మరీ చేరువైనవారు. ఆ పత్రికలోని "హైదరాబాదు నోట్‌బుక్" శీర్షికకు వివిధ విషయములు వ్రాయుచున్నారు. ఆ శీర్షిక కొసలో వారు వ్రాయు "ఉపశ్రుతి" కొందరికి చురుకు ముట్టించును. అంతటి నిశితమైన కలం వారిది. తెలుగు పత్రికా రంగములో వీరికి మంచిపేరు, గౌరవస్థానము కలదు. కాన్పూర్ డెయిలీ టెలిగ్రాఫ్ - తెలంగాణా - మీజాన్ తెలుగు దినపత్రిక-హైదరాబాద్, ఆంధ్రప్రభ-భారతి - ఆంధ్రపత్రిక - ఆంధ్రభూమి-హిందూస్తాన్ సమాచార్ మొదలగు వివిధ పత్రికలలో సహాయ సంపాదకులుగా పనిచేసి పేరు గడించిరి.

వీరు బహు భాషా కోవిదులు. తెలుగు, సంస్కృతం, ప్రాకృతం, హిందీ, కన్నడము, తమిళము, ఇంగ్లీషు, పంజాబీ (కొద్దిగా) వీరికి తెలిసిన భాషలు. ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున వీరు సహాయ పండితులుగా పనిచేయుటవలన వీరిన్ని భాషలు నేర్వ గలిగిరి. అట్లే శాసన, చరిత్ర, భాషాదులలో పరిశోధనాభిరుచి ఏర్పడినది.

రామచంద్రగారి తాతగారైన తిరుమల తాడిమఱ్ఱి వరసింహాచార్యులు అనంతపురం జిల్లా ధర్మవరం తాలూకా తాడిమఱ్ఱి

సామంతరాజులకు గురువులుగా వ్యవహరించిరి. వీరు విజయ నగర సార్వభౌముల గురువైన తాతాచార్యుల వంశమువారు. విజయనగర రాజుల తదనంతరం వీరు సామంతరాజుల నాశ్ర యించిరి. కాలక్రమేణ ఆ సామంతరాజ్యము లన్నియు ఆంగ్లే యులవశమై పోవుటచే గురువుల వంశస్థులు దిక్కుకొకరైరి. అప్పుడు మన రామచంద్రగారి తాతగారైన తిరుమల తాడిమఱ్ఱి నరసింహాచార్యులు తమ మేనమామగారైన ప్రబంధం శ్రీనివాసా చార్యుల ఊరైన బళ్ళారి జిల్లాలోని కమలాపురం చేరిరి. తండ్రి గారి కాలమున వీరు వైభవముగా జీవించిరి. వారి కాలమున తిలక్ మహరాజ్, మహాత్మాగాంధీ గారల జాతీయోద్యమము మిక్కుటముగా వ్యాపించుటచే వారందరు శుద్ధ ఖద్దరు వస్త్ర ధారులై జాతీయవాదులుగా వెలిగిరి. ఆ వాతావరణమున మన తిరుమల రామచంద్రగారు పెరుగుటచే వారి మనసులోకూడ జాతీయ భావములు చిగురించినవి.

1932 లో వీరు తిరుపతి సంస్కృత కళాశాలలో చదువు సాగించునప్పుడు విదేశీ వస్త్ర బహిష్కరణ, ఖద్దరుధారణ మొద లైన కాంగ్రెస్సు కార్యక్రమములు నిర్వహించుచూ, తిరుపతి పట్టణ కాంగ్రెస్సు సంఘపు కార్యదర్శిగా కొన్నేళ్లు వ్యవహరించిరి. తిరుపతిలో జరిగిన ఒక జాతీయోద్యమ సంఘటన వీరి జీవిత మున అనేక మార్పులను తెచ్చినది. తిరుపతి గోవిందరాజస్వామి

మహాద్వార గోపురపు నాల్గవ అంతస్థుపైన ఈయన కాంగ్రెస్సు త్రివర్ణ పతాకము ఎగురవేసినందుకు, నిషిద్ధ కరపత్రములు పంచి పెట్టినందుకు పోలీసులు వీరిని అరెస్టు చేసిరి. చంద్రగిరి కోర్టువారు ఆయనకు సంవత్సర కఠిన కారాగారవాస శిక్షను విధించిరి. ఆయన రాయవేలూరు, తిరుచినాపల్లి జైళ్ళలో ఉన్నప్పుడు లాహోరు కుట్ర కేసు నిందితులైన భగతసింగ్ సహచరులైన బట్‌కేశ్వర్‌దత్, కుందన్‌లాల్‌గుప్త మున్నగు విప్లవ కారులతోను, విప్లవ నాయకులైన సురేంద్రమోహన్ ఘోష్, జీవన్‌లాల్ చటర్జీ, ప్రతూల్‌చంద్ర గంగూలీ మున్నగు వారితోను వివిధ ప్రాంతముల నాయకులతోను పరిచయము లేర్పడినవి. దాని పరిణామముగా 1934 లో మద్రాసు కుట్ర కేసులో ముద్దాయిగా లెక్కింపబడిరి. వయస్సులో చిన్నవారు కావడం, కేసుతో ఎక్కువ సంబంధం లేకపోవడంవల్ల వీరిని విడుదల చేసిరి. కానీ పోలీసులు చాల సంవత్సరములు వీరిని వెన్నాడుచుండిరి.

రాజకీయ దశ ముగిసిన తరువాత నెల్లూరు, మద్రాసు మైలాపూర్ వేద సంస్కృత కళాశాలలో కొంతకాలము చదివి, తండ్రిగారి హితవు మేరకు భాషా సారస్వత సేవలు, రాజకీయ ముల కన్నా ముఖ్యమైనవేనవి, అదికూడా దేశసేవ వంటిదేనని నమ్మి రామచంద్రగారు జీవిక కొరకు మద్రాసు ప్రాచ్య లిఖిత

భాండాగారములో లేఖకులుగా చేరిరి. అక్కడ శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి కడ అసిస్టెంట్ పండితుడుగా పనిచేసిరి.

ఇక వీరి సాహిత్య కృషిని గూర్చి కొంత ముచ్చటింతము. వీరు రచించిన పుస్తకముల పట్టికను పరిశీలించిన వీరు గొప్ప రచయితలు, చక్కటి బహుభాషా అనువాదకులు, పరిశోధకులు, వ్యాస కర్తలు, నవలాకారులు, వైద్య గ్రంథకర్తలు, పెక్కు ప్రత్యేక సంచికలకు సంపాదకులు, గ్రంథ సమీక్షకులు, పీఠికా కర్తలుగా వెలుగొందిన విద్వన్మణులని చెప్పవచ్చును. సంస్కృతములో వీరు సత్యాగ్రహవిజయం, సుమతి శతకం అను కృతులను రచించిరి. హిందువుల పండుగలు-పర్వములు; మనలిపి పుట్టు పూర్వోత్తరాలు; గాథాసప్తశతిలో తెలుగుపదాలు; నుడి-నానుడి; సాహితీ సుగతుని స్వగతం; ప్రాచీనాంధ్ర గాథలు-మొదలగునవి వీరి పరిశోధన, భాషాశాస్త్ర, వ్యాస రచనలకు నిదర్శనలు.

కన్నడనవల శాంతల; తమిళం నుండి రాజాజీ కథలు; ఆంగ్లంనుండి భక్తి వేదాంతస్వామి కమింగ్ బ్యాక్; హిందీ నుండి డాక్టర్ సుశీలానయ్యర్ గారి గాంధీజీ కారాగారగాథ; సంస్కృతం నుండి క్షేమేంద్రుని బృహత్కథామంజరి; ప్రాకృతం నుండి లీలావతికావ్యం; వీరి అనువాద ప్రతిభకు అణిముత్యాలు. వీర గాథలు, దక్షిణాంధ్ర వీరులు, కాటమరాజుకథ, శశాంకవతి,

(నవల) ధర్మదీక్ష వీరి స్వతంత్ర తెనుగు రచనలలో ఎన్నదగి నవి. తెలుగు విజ్ఞాన సర్వస్వంలోని లలితకళా సంపుటి వీరి ప్రత్యేక సంచికల సంపాదకత్వ కృషికి మేల్బంతి.

బహు భాషాకోవిదులు, బహు గ్రంథకర్తలైన శ్రీరామ చంద్రగారు బహు సన్మానగ్రహీతులు కూడాను. వీరు పత్రకార శిరోమణి, మహా మహోపాధ్యాయ, కళాసరస్వతి అను బిరుద ములచేత గౌరవింపబడిరి. ప్రథమ, ద్వితీయ ప్రపంచ మహా సభలలోను, ఆంధ్రప్రదేశ్ జర్నలిస్ట్ అసోసియేషన్ వారిచేతను సన్మాన, సత్కారములు పొందిరి. ఆం. ప్ర. బాలల అకాడమీకి కార్యదర్శిగాను, ప్రాకృత అకాడమీకి అధ్యక్షులుగాను వ్యవహ రించు చున్నారు.

స్వాతంత్ర్య సమరయోధులుగా, స్వతంత్ర సైనిక్ సమ్మాన్ పెన్షన్, మరియు భాషాసాహిత్య సేవకులుగా అంధ్ర ప్రదేశ్ ప్రభుత్వము నుండి పెన్షన్ పొందుతూ, కొడుకులూ, కూతుళ్ళూ కలిగి హైదరాబాదులో హాయిగా వుంటున్నారు.

ఈ బహుభాషా కోవిదులు బహుకాలము ఆయురారోగ్య భాగ్యములతో వర్ధిల్లుగాక !





# కె. సుబ్బరామప్ప

జననము : 23-9-1913

తల్లి:

శ్రీమతి రంగమ్మ

తండ్రి :

శ్రీ కె. సుబ్బరామప్ప

జన్మస్థలం:

మేడాపురం.

ధర్మవరం తా॥

అనంతపురం జిల్లా

తెలుగు కన్నడ భాషలకు ఏక లిపి అవసరమని తలచి అందుకొరకు ద్విభాషా నిఘంటువును తయారుచేయుటలో అహోరాత్రులు కృషి చేసినవారు. తెలుగు కన్నడ సాహితీ దురంధరులు శ్రీ కె. సుబ్బరాయప్పగారు. అందుకుగాను ఆంధ్ర కర్ణాటక రాష్ట్రప్రభుత్వములు, కన్నడ సాహిత్య పరిషత్తు అంగీకరించడం, సహకార మందించడం జరిగింది. అప్పటి తెలుగు ప్రభుత్వం నియమించిన "తెలుగు లిపి సంస్కరణ"లో సుబ్బరామప్పగారు ఒక సభ్యులుగా పనిచేసిరి. అట్లే కర్ణాటక ప్రభుత్వంవారు కూడ వీరిని తమ రాష్ట్రములో తెలుగు పాఠ్య పుస్తకాలు వ్రాయుటకు నియమించిన కమిటీకి అధ్యక్షులుగా చేసిరి.

శ్రీ సుబ్బరామప్ప మదనపల్లిలోని బిసెంట్ థియసాఫికల్ హైస్కూలు, కళాశాలల్లో చదివి, విద్వాన్, ఎం ఎ. బి.ఇడి; బి.ఓ.ఎల్, పరీక్షలలో ఉత్తీర్ణులైరి. మదనపల్లెలో తాను చదివిన హైస్కూల్, కళాశాలలోనే వీరు అసిస్టెంట్ హెడ్ మాష్టరుగా, తెలుగు లెక్చరర్‌గా పనిచేశారు.

1949 జనవరి నాటికి మైసూరు విశ్వ విద్యాలయములో తెలుగుభాషా శాఖాధ్యక్షులుగా చేరిరి. మైసూరు చేరిన పిమ్మట వీరు కన్నడభాషా సాహిత్యమును బాగుగా అభ్యసించి తెలుగు, కన్నడ భాషా సాహిత్యములలోని గొప్పదనములను వ్యాసముల ద్వారా తెలియజేయుచుండిరి. వీరి వ్యాసములు ఇంగ్లీషు, కన్నడ, తెలుగుపత్రికలలో అనేకములు ప్రకటితమైనవి. 1975 నవంబరు 6వ తేది ఇండియన్ ఎక్స్‌ప్రెస్ దినపత్రికలో వీరు వ్రాసిన "On Kannada Telugu Harmony" అనబడు వ్యాసములో తెలుగుకవులు కొందరు కన్నడరాజ్యంలో ఏ విధంగా నివసించి ఆ భాషను నేర్చి గ్రంథములను వ్రాయగలిగిరో సోదాహరణముగా వివరించిరి.

నన్నయ నుండి వేమన వరకుగల తెలుగుకవుల రచనల నుండి తెలుగు పద్యములను సేకరించి వీరు "తెలుగు పాఠగళు" అనబడు తెలుగు పద్య సంకలనమును తయారుచేసిరి. దీనిని మైసూరు విశ్వ విద్యాలయ ప్రచురణశాఖవారు ప్రకటించి, వీరిని

గౌరవించిరి. తెలుగు సాహిత్యమును పరిచయము చేసికొనగోరు కన్నడిగులకిది మిక్కిలి యుపయుక్తమగు రీతిగా, అచ్చతెలుగు పదములకు కన్నడ అర్థములను, కన్నడభాషలోనే ఉపోద్ఘాత మును వ్రాసి ముద్రించిరి.

మైసూరు యూనివర్శిటీ నుండి పరిశోధనా పట్టమును పొందగోరు సాహిత్య విద్యార్థులకు వీరు పర్యవేక్షకులుగా నుండిరి. వీరి పర్యవేక్షణలో పరిశోధన చేసి పి.హెచ్.డి., పట్ట ణమును పొందినవారిలో శ్రీ నండూరు రామకృష్ణమాచార్యులు-తిరుపతి, గారొకరు. ప్రొఫెసర్ సుబ్బరామప్పగారు ఆంధ్ర, ఉస్మానియా, వేంకటేశ్వర, మద్రాసు, విశ్వవిద్యాలయములలో తెలుగుభాషకు సంబంధించిన బోర్డు ఆఫ్ స్టడీస్ మొదలైన వానిలో సభ్యులుగా పనిచేసిరి.

తెలుగు విజ్ఞాన సర్వస్వములోని విశ్వసాహితి VI వ సంపుటములో వీరు వ్రాసిన "కన్నడ రత్నత్రయము" (పంప, పొన్న, రన్నకవులు) అను వ్యాసము ప్రకటింపబడినది. అట్లే కన్నడ విజ్ఞాన సర్వస్వమునకు "తెలుగు ఛందస్సు"ను గూర్చి కన్నడభాషలో తులనాత్మక వ్యాసము వ్రాసిరి. మైసూరు ప్రభుత్వం ప్రకటించిన "Karnataka through the Ages" అనే ఇంగ్లీషు సంకలన ఉద్గ్రంథమునకు వీరు "Telugu Literature in Karnataka" అను పరిశోధనాత్మక వ్యాసము

వ్రాసిరి. హైదరాబాద్‌లో ప్రకటింపబడిన సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశం 3వ సంపుటమున వీరి "కోలారు జిల్లా" అను వ్యాసము ప్రకటింపబడినది.

ప్రొఫెసర్ సుబ్బరామప్పగారు జీవితాంతము తెలుగు కన్నడములకు ఏక లిపిని చేయు బృహత్కార్యములోనే నిమగ్నులై, కన్నడ, తెలుగువారల మధుర బాంధవ్యములకు వారధి గట్టిన వారైరి. తెలుగు, కన్నడ ప్రజల హృదయాంతరాళములలో శాశ్వితులైరి.

---



## శ్రీ చౌక్కావు నారాయణస్వామి

జననము : 4-4-1939

తల్లి: శ్రీమతి ఓబలాంబ

తండ్రి : శ్రీ కంబయ్య

జన్మస్థలం : యు. కొత్తపల్లి డోన్ తా॥ కర్నూలు జిల్లా

అది 1956 వ సంవత్సరం. అనంతపురం కళాశాలకు శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు క్రొత్తగా ప్రిన్సిపాల్‌గా

నియమితులైరి. వారు సైన్సులో డాక్టరేట్ పొందినను, పక్షి పదాలు మొదలు పరమాణువు వరకు క్షుణ్ణంగా విషయ పరిజ్ఞానముగల వ్యక్తి. ఆయనగారు ఆ సంవత్సరం కళాశాల మ్యాగజైనుకు విద్యార్థులనుండి వ్యాసములు సేకరించి, వచ్చిన వ్యాసములను పరిశీలించిరి. అందులో ఒక విద్యార్థి జానపద సాహిత్యమును గూర్చి వ్రాసిన వ్యాసము అమితంగా ఆయన్ని ఆకర్షించింది. ఆ విద్యార్థి ని పిలిచి వివరాలు అడిగి తెలుసుకొన్నారు. ఆ విద్యార్థికి జానపద సాహిత్యంపై గల మక్కువను గ్రహించి, జానపద పాటలను సేకరింపు మని ప్రోత్సహించిరి. ఆనాటి నుండి వారిరువురు సాహితీ మిత్రులైరి. ప్రతి దినం ఆ విద్యార్థి ప్రిన్సిపాల్‌గారి ఇంటివద్దకు వెళ్ళి జానపద గేయాలను గూర్చి, లేపాక్షి, తాడిపత్రి దేవాలయముల శిల్పములను గూర్చి చర్చించుకొనేవారు. ఇంతకూ ఆ విద్యార్థి ఎవరు? ఎవరూ కాదు. ఆ విద్యార్థి చొక్కాపు నారాయణస్వామే నని వేరుగా జెప్ప పనిలేదు.

పూవు పుట్టగనే పరిమళించునన్నట్లు నారాయణస్వామి చొక్కాపు వంశములో పుట్టిన నాటినుండే సాహితీ పరిమళములు గుబాళించినవి. ప్రాథమిక విద్యాభ్యాసమును స్వగ్రామములో ముగించి, ఉన్నత విద్యను డోన్‌లో జరుపుతున్నప్పుడు వీరు వీరి మామగారైన ఆలామంకన్నగారి సమక్షములో ఉండడం

జరిగింది. అక్కడి సాధు సాంగత్యము, వేదాంత చర్చలు, వీరిని ఆధ్యాత్మిక దృష్టిలోనికి మరల్చింది. అప్పుడే ప్రాచీన తాళపత్ర గ్రంథ సేకరణపై విశేషమైన అభిరుచి ఏర్పడింది. దొరికిన ప్రతి తాళపత్ర గ్రంథమును, వ్రాతప్రతులను సేకరించి భద్రపరచడం మొదలుపెట్టిరి. రాను రాను వారి నిలయం "సరస్వతీ నిలయం" గా మారింది.

వీరి తాళపత్ర గ్రంథసేకరణ కృషినిగూర్చి కీ॥ శే॥ కళా ప్రపూర్ణ నిడదవోలు వేంకటరావుగారి వంటి పరిశోధన కర్తలు తమ అమూల్యాభిప్రాయముల నిట్లు తెలిపిరి. "శ్రీ నారాయణ స్వామి గారైదువందలకుపైగా నమూల్యములగు తెలుగు తాళ పత్రములను, వ్రాత ప్రతులను సేకరించిరి. వారి గ్రంథ సంచ యమున నెట్టి యద్భుతపు కబ్బములున్నవో తెలుపుటకు ఒక ఉదాహరణము చూపుచున్నాను. ఇప్పటికి నాల్గేండ్ల క్రిందట 1950లో మద్రాసు విశ్వవిద్యాలయ పక్షమున తెలుగు కవుల చరిత్ర అను గ్రంథమును ప్రకటించినారు. అందు "విష్ణు వర్ధన మంత్రి - బృహజ్జాతకము" అను ప్రథమ తెలుగు వచన కృతిని గూర్చి ప్రస్తావించితిని. ఇంతవరకు సాహిత్యలోక మెరుగని ఈ కృతికి ప్రత్యంతరము లభింపగలదను నాశయును నాకు లేకపోయినది. ఇట్లుండ ఆంధ్ర ప్రభుత్వమువారి ఆర్షశాఖ (State Archives) వారిచే నియమితుడనై మహబూబ్

నగరమున శ్రీ నారాయణస్వామి తాళపత్ర గ్రంథములు పరిశీలించుచుండగా "విష్ణువర్ధనమంత్రి - బృహజ్జాతకము" అన్న గ్రంథమును జూచి నేనత్యంతాశ్చర్య భరితుడైనాను. దీనికి ప్రత్యంతరము ఒక తంజావూరు పుస్తక భాండాగారములో తప్ప వేరొకచోట చూడలేదు. అదియును అసమగ్రము. నారాయణ స్వామిగారు ఇప్పటికనేక గ్రంథములను పరిష్కరించియున్నారు.

వాఙ్మయ పరిశోధకులకు ఎంతో యుపయోగకరముగా నుండునట్లుగా నొక సూచిక తయారుచేయుచున్నారు. ఇది సంపూర్ణముగా సిద్ధమైనచో నాంధ్రదేశమున విశ్వ విద్యాలయ పరిశోధకులకు సాహితీ వేత్తలకు వాఙ్మయ చరిత్రకారులకు నత్యంత ఉపయుక్తమగును. ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమువారు, సాహిత్య పరిశోధక సంస్థలు, విశ్వవిద్యాలయములు చేయవలసిన పనిని శ్రీ నారాయణస్వామిగారు అందును సాహిత్యేతరోద్యోగమున నున్నవారు చేయుట ఎంతో యభినందనీయము."

శ్రీ నారాయణస్వామి పరిష్కరించిన, ప్రచురించిన తాళపత్ర గ్రంథములు వరుసగా యివి. 1) బ్రహ్మాండ వచనము:- దీని కర్త మాచనామాత్యుడు. చతుర్వేదములను, అష్టాదశ పురాణములను పరిశీలించి సారంబును తీసి ఈ బ్రహ్మాండ వచనము చేసెను. ఇదొక సంక్షిప్త విజ్ఞాన సర్వస్వము. మానవుని

సందేహ నివృత్తికోశము. ఈ వచన కృతిని పరిష్కరించుటకు నారాయణస్వామిగారు మద్రాసు, తిరుపతి, తంజావూరు ప్రాచ్య లిఖిత తాళపత్ర భాండాగారముల అధిపతులతో సంప్రదించి ఆ గ్రంథములను క్షుణ్ణముగా పరిశీలించి, ఒక తీరుకు తెచ్చిన విషయము సర్వదా శ్లాఘనీయము. ఇందు వీరు చక్కటి పీఠికను కూడా వ్రాసిరి.

తరువాత 2) శఠకోప విన్నపములు - వీరు తాళపత్రముల నుండి పరిష్కరించిన గ్రంథము. శఠకోపముని ఆళ్వార్లలో కెడు ప్రసిద్ధుడు. అతని విన్నపములివి. తరువాతి గ్రంథము 3) సభాపతి వచనములు. శ్రీ నారాయణస్వామి సంకలనము చేసిన గ్రంథములలో "ఆంధ్ర వచన మణిభూషణము" ఒకటి. ఇది ఆంధ్ర సాహిత్య లోకమునకే నూతనమైనది. ఈ గ్రంథము ప్రజలను ఆధ్యాత్మిక దృషి వైపుకు మరల్చును.

ఇంకను వీరి అముద్రిత రచనలు కొన్ని గలవు. 1. శ్రీ లక్ష్మీనారాయణ నానార్థ నిఘంటువు 2) పాలమూరి మండల రాజకవులు 3) వర్ధమానపురం 4) వైద్యశతశ్లోకి 5) నారాయణస్వామి గేయాలు 6) విత్యాను సంధానము 7) విష్ణు వర్ధనమంత్రి రచించిన "బృహజ్జాతకము"ను పరిష్కరించిటీకతో ప్రచురించనున్నారు. ఒకవైపు తాళపత్ర గ్రంథ పరిశోధన, మరోవైపు జానపద గేయముల సేకరణ రెండునూ అడ్డులేక

చొక్కపువారు సాగించినారు. వీరు వెలువరించిన జానపద గేయ సంకలనము "తేనెసోనలు". ఇందు 23 గేయములు కలవు. అన్నియు వివిధ వైవిధ్యములుగల జానపద గేయములే. ఈ కృతి ఆపాత మధురోద్యమానికి నాంది. 1966లో ఈ గేయములను ముద్రింపదలచి, ప్రెస్సువారికి డబ్బుకూడా చెల్లించిన సమయములో శ్రీ అనంతాచారి అను ఒక కవి మిత్రుడు కోరిక మేరకు ఆయన వ్రాసిన "శ్రీ వేంకటేశ్వర శతకము"ను పై కృతికి మారుగా ముద్రించుట జరిగినదని వ్రాసుకొన్నారు. ఈ చొక్కపు వారు కృతికర్తలే కాదు. కృతిభర్తలు కూడనని నిరూపించుకొన్నారు. అట్లే డా॥ వల్లపురెడ్డి బుచ్చారెడ్డిగారి "ముక్త గీతికల"ను కూడా వీరు 1972లో ముద్రించి కవిపోషకులైరి. ఆగిపోయిన వీరి తేనెసోనలు 1974లో వెలుగులోనికి వచ్చినది.

జీవిత భీమా సంస్థలో వీరు విస్తరణాధికారిగా పని చేయుచూ ఆ సంస్థకుకూడ తమ సాహిత్యసేవను నాటకముల ద్వారా అందించిరి. జీవితభీమా కథ; పరివర్తన, నాటికలు జీవితభీమా అంశముపై వ్రాయబడిన రచనలే. నాటకములలో నటించుట కూడా వీరికి చిన్నతనము నుండి వున్న అభిరుచి. ధ్రువోపాఖ్యానములో వీరు "సురుచి" స్త్రీ పాత్రను, శ్రీకృష్ణ రాయబారములో శ్రీకృష్ణుని పాత్రను, కనువిప్పు, యోగక్షేమం మొదలగు సాంఘిక నాటకములలో నాయక పాత్రలను వేసిరి.

ఇక వీరి సాహిత్య, సాంస్కృతిక, విద్య, వైద్య, గ్రంథాలయ, దేవాలయ మొదలగు వివిధ సంస్థల నిర్వహణా కార్యక్రమములను గూర్చి విపులీకరించుటకు వేయినాల్కల ఆదిశేషునికైనను వీలుకాదు. 1957-61 సం॥ మధ్య ద్రోణాచలంలో ఒక ఉచిత హోమియోపతి వైద్యశాలను స్థాపించి బీదలకు సేవ చేసిరి. 1964లో మహబూబ్‌నగరమునందు "వివేకానంద విద్యాకేంద్రము"ను స్థాపించి విద్యావ్యాప్తిని, మహబూబ్‌నగర్ తాలూకాలోగల రామకొండలో దేవాలయ నిర్మాణము, 1976లో వరంగల్ సాహితీ సమితి స్థాపన, "చొక్కపువారి సరస్వతీ నిలయం" (గ్రంథాలయం) భారత సేవక సమాజ్ కన్వీనర్‌గా, జీవ కారుణ్య సంఘమునకు గౌరవ కార్యదర్శిగా, వక్తగా, బహుముఖ కార్యకర్తలుగా వ్యవహరించుచున్నారు.

మంచి వ్యక్తిత్వము, మూర్తిమత్వము, సహృదయతలకు వీరు పెట్టినది పేరు. అందుకే విశదవోలువారు వీరిని గూర్చి యిట్లు ప్రస్తుతించిరి.

చొక్కపు రూపురేఖలును, చొక్కమునైన మనంబు మాటయున్
చొక్కపు చేతలెల్లకదు, చొక్కపు వర్తన మెంచి చూడగా
చొక్కమువై జనంబులను చొక్కగ జేయుటచేత నీతడున్
చొక్కపు వంగడంబునను శోభిలె గాదె యమోఘధీభ్యదై

ఇంతటి యశోవంతులైన శ్రీ చొక్కపువారు జీవితభీమా

సంస్థలో కూడా మంచిపేరును సంపాదించుకొని, సాహితీసేవను వదలక, నిర్వహించుచూ, భార్యాపుత్ర సమేతులై ప్రస్తుతము కర్నూలునందు నివసించుచున్నారు. వీరికి భగవంతుడు ఆయు రారోగ్య భాగ్యములనిచ్చి వీరిచేత జీవితాంతము బహు విధము లైన సాహిత్య సేవలను చేయించుగాక!

---



## శ్రీ శంకరంబాడి సుందరాచారి

జన్మస్థలము :
తిరుపతి. చిత్తూరు జిల్లా

నిర్యాణము ; 1977
ఏప్రిల్ 8వ తేది

ఆరుకోట్ల ఆంధ్రప్రజల శ్రవణ పేటికలలో రింగుమని మారుమ్రోగే విధముగా " మా తెనుగుతల్లికి మల్లెపూదండ "ను రచించి ఆమె కీర్తిని గానం చేయించిన కవివరేణ్యుడు మన శంకరంబాడి సుందరాచారి.

"శంకరంబాడి సుందరాచారి నేను" అని ఒకపరి అప్రయత్నంగా అతని నోటినుండి వెలువడింది. వాల్మీకి శోకమే శ్లోకమైనట్లు సుందరాచారి నోటినుండి జాలువారిన ఈ తియ్యటిమాట తెటతెనుగు ఛందస్సులో తేటగీతి పాదముగా అవతరించింది. "అయితే నేను తేటగీతి కవిని" అని మురిసిపోయాడు ఆయన. ఆ అప్రయత్న భావనలో ప్రభావితుడైన ఈ కవి ప్రయత్న పూర్వకముగా దాదాపు 15,000 తేటగీతికలను కడురమ్యంగా భావయుక్తంగా అలతి అలతి పదములతో, ఇంతవరకూ ఇంత చక్కగా తేటగీతికలను అల్లిన కవి లేడను విధంగా రచించి, తేటగీతి సుందరాచారిపొత్తుగా - సాహిత్యలోకములో పరిగణింపబడినాడు. అందుకే ఈ సుకవి తన "సుందర రామాయణ" కావ్యములో యట్లు వ్రాసుకొన్నాడు.

ఆంధ్రుడనగ జెల్లు యక్కరంబులు నేర్చి
నంత, దీని జేత నందీ చదువ
వచ్చువంచు, సరళ పదముల మృదుళమౌ
నడకగూర్చి నడపినాడ వింతె.

ఈ సుందర రామాయణమును వీరు పూర్తిగా తేటగీతలందె వ్రాసి ఒక ఘనతను సాధించిరి. ఈ రామాయణము అచ్చులో వున్నప్పుడు కీ॥ శే॥ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు వీటి ప్రూఫులు దిద్దుపనికి ఒప్పుకొనిరి. సుందరాచార్యులవారు

ఒకవైపు రచన, మరొకవైపు కావ్యముద్రణ సాగించు సమయమున, అనంతకృష్ణశర్మగారికి ఒక సందేహము కల్గి "అయ్యా! సుందరాచారీ! తాటకి భయంకర స్వరూపిణి. నీ తేటగీతుల్లో ఇముడుతుందా?" అని ప్రశ్నించారు. ఆయన దానినొక సవాలుగా స్వీకరించి తాటకినిట్లు ప్రవేశపెట్టిరి.

నల్లకొండల నుగ్గుగా నలగగొట్టి
చిమ్మ చీకటిలోగల చేవబిండి
కాళసర్పాల విసమెల్ల గలిపినూరి
కాచిపోసిన రూపుగా గానుపించె

పచ్చి రక్కసి, నడగొండవలెను, వదన
గహ్వరము విచ్చి మంటలుగ్రక్కి, నాల్క
సాచి, కనులెఱ్ఱవార, చేయూచికొనుచు
నురము ముందునకునెట్టి, శిరమునెత్తి

కాలభైరవియై వల్లకాటికెల్ల
దానె గాపరి యనమించి తలలమాల
మెడను వ్రేలాడ, డ్రాచులు పడగలెత్తి
భూషలయి మేన బుసకొట్టి, ఘోషలిడుచు

హారులు, తరులును, గిరులును, దరువులొకట
వెంట బడిమూగ, నడుగులు, పిడుగులగుచు

నిడిన చోట్లెల్ల గోతులు వడుచునుండ
నచటి కరుదెంచె వికటాట్టహాసముగను.

తేటతెనుగు తనమును పుణికి పుచ్చుకొని ఎదుట తారస పడిన సుందరాచారి తాటకిని చూచి, విమర్శకాగ్రేసర చక్రవర్తి రాళ్ళపల్లివారు ముక్కుమీద వేలేసుకొన్నారు. ఈ తేటగీతుల కవి ప్రతిభను తేటగీతిలోనే యిట్లు వారు ప్రస్తుతించినారు.

తేటగీతుల దెలుగు తీదీపు రుచుల
యూట, కొంకుల కొసరుల కాటుపడక
నమ్మి నమ్మించు, నిత్య బోధమ్ముదాకు
సారతరమిది సుందరాచారి కవితః

"ప్రాచీన కావ్యములు ప్రతిభా సమన్వితములు. విశ్వ శ్రేయమునెంచి విరచింపబడినవి. వానిని మించి వెలయగల నూతన సృష్టి ప్రయత్నములు మరెవ్వరికేమోగాని, నా చేతగాని పని" అని సుందరాచారిగారు సవినయముగా చెప్పుకొనుచూ, తన మనోభావము నిట్లు ప్రకటించిరి.

వారును వీరుమెచ్చుకొను టంగినిగోరి, కలమ్మునబట్టి నే
నేరను వ్రాయకబ్బముల నిందు మనమ్మది పొంగి యేరులై
పారెడుదాక, యుక్తపదబంధము తీరెడుదాక, భావముల్
జారవు నాకలమ్మువిడి, సత్యము, నాహృదయమ్ము తెల్పితిన్

ఎంతటి సముచిత సమంజసమైన నిర్ణయమిది.

సుందరాచారి "బుద్ధగీత"పై శ్రీ పుట్టపర్తివారు 1954లో తమ అమూల్యాభిప్రాయము నిట్లు చెప్పిరి. "సుందరాచారి చక్కని భావకుడు. అతని కలము తీయనైనది. జీవితమును అనుభవించి, అనుభవించు చున్నాడు. ఇట్టివారి వ్రాతలలో సాహసము, తీక్షణత ప్రధాన గుణములు. అతడేరుకొన్న "గీతము" మట్టసమైనది. వ్యర్థ పదముల తిండిని జీర్ణించుకొనుటకు దానికి బృహత్కాయము లేదు. అతడు "గీత" ఛందస్సులో ఉదార రచనను నడుపుట సంతోషము"

ఈ బుద్ధగీతలో, బుద్ధుని జననము - గృహనిర్గమనము- దివ్యబోధ ప్రబోధములను పూవు-గాయ-పండు గా వర్గీకరించి బుద్ధుని కథను కడురమ్యముగా చిత్రించిరి. సంతతి లేక శుద్ధోధన మహారాజు, మాయాదేవు లొక్కరేకాదు, ప్రకృతియావత్తూ యువరాజు పుట్టలేదని కుందినది. దానిని కవిగారిట్లు వర్ణించినారు.

ఆలమందకు మేతల యాసలేదు
చిన్నదూడలు పొదుగుల చేరబోవు
కోకిలమ్మకు గొంతులో గాఅతతోచి
చివురుటాకులు చేదని చిన్నబోయె.

పై భావన అమోఘము కదా! ఆ ప్రకృతే గౌతముడు

పుట్టినప్పుడెట్లు హర్షించినదో చూతము.

పసిడి కంకులు తొడిగెను పంటచేలు
పాడియావుల పొదుగులు పాలుగార్చె
పైట చెఱగుల తెరదోచి పాపలెల్ల
బట్టు బట్టిరి. తనివార బాలుచేప.

చెన్నుని రథముపై నెక్కి వెడలిన గౌతముడు గాంచిన దృశ్యముల నిట్లు కవి వర్ణించినాడు.

ఏడ జూచిన నేడుపె, పాడుబ్రతుకె
యెందు జూచిన హింసయే యేవగించె
లోకమందునగల యట్టి శోకమెల్ల
పాక మందెను కనుముందు బాపమేమొ,

ఈ విధంగా వీరి కవితామృతవాహిని మందాకిని వలె కడు గంభీరతతో ముందుకు సాగిపోతుంది.

శ్రీ సుందరాచారి తిరుపతిలో సంపన్న సదాచార శ్రీవైష్ణవ కుటుంబములో జన్మించినాడు. చిన్నతనములోనే తండ్రిగారితో మాటపడి, పట్టింపుపైన ఇల్లు విడిచి వెళ్లి మద్రాసు చేరి దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారిని ఆశ్రయించి, తన స్థితి గతులను వివరించి ఉద్యోగమును అర్థించినాడు. ఆయన ఆంధ్రపత్రికలో ప్రూఫ్‌రీడరుగా నియమించినాడు.

ఆ తరువాత అనతి కాలములోనే ఆంధ్ర సచిత్రవారపత్రికకు ఉప సంపాదకుడైనాడు. పద్మశ్రీ చిత్తూరు నాగయ్య ఆధ్వర్యములో గ్రామఫోను పాటలు వ్రాసినాడు. ఆ రోజుల్లో ఆయన వ్రాసిన ఉషాపరిణయము నాటకం బహుళ ప్రచారం పొందింది. అటు తరువాత సినిమాకవిగా పేరు తెచ్చుకొని, బిల్హణ చిత్రానికి మాటలు, పాటలు వ్రాసిరి.. దీనబంధు చిత్రమునకు శ్రీ హెచ్. యం. రెడ్డిగారితో కలిసి పనిచేసిరి.

ఆ తరువాత ఎందుకో ఓ శుభ ముహూర్తమున అన్నింటిని వదలిపెట్టి ఉపాధ్యాయ వృత్తిలోనికి ప్రవేశించి, క్రమేణ డిప్యూటీ ఇన్‌స్పెక్టరుగా నియమితులైనారు. స్వతంత్ర భావాలు నిండుగాగల వ్యక్తి కావడంతో అన్నింటికి తిలోదకాలిచ్చి సాహితీ జీవనం చేపట్టి, కవిత్వముకొరకే జీవించిరి. జీవితమును కాచి వడబోసిన అనుభవజ్ఞుడగుటచే సుందరాచారి తన మనసులోని మాటను దాచుకొనక భగవంతుని ముందు వినమ్రుడై ఇట్లు విన్నవించుకొన్నాడు.

అర్థము గడియించి, అధికారమున పొంగి
అతివలిచ్చు సుఖము లనుభవించి
ఆశదీర త్రాగి ఆడినా పాడినా
చిక్కలేదు సుఖము శ్రీనివాస!

తుదకా చిక్కని సుఖము శ్రీనివాసునికడనే లభించునని

తలచి తన్ను పెంచి పెద్దచేసిన తెలుగుతల్లికి వాడని "మల్లె పూదండ" ను సమర్పించి ధన్యతను పొందిరి. ఈ కవిగారిని 1974 "రాక్షస" ఉగాది పర్వదినమున హైదరాబాదులో జరిగిన "ప్రపంచ తెలుగు మహాసభ"లలో వీరిని ఆంధ్రప్రభుత్వము సన్మానించి, వీరు వ్రాసిన "మా తెలుగుతల్లికి మల్లెపూదండ" పాటను రాష్ట్రగీతముగా పరిగణించిరి.

"కవితకు నిత్య నూతనత్వం అలవడాలి. అన్వేషించే కొద్దీ అపురూప భావాలు పొడమాలి. ఉత్సాహం వృద్ధికావాలి. ఆశలు రేకెత్తాలి. ఒకే కావ్యం ఏనాటికానాడు క్రొంగ్రొత్తగా కని పించాలి. ఊహించే కొద్దీ విస్తరిల్లాలి. మనోవాతావరణాన్ననుసరించి మారుతూ రావాలి. కావ్యమే నాలుగు గీటులైతే కావ్యార్థం నాలుగు గ్రంథాలు కావాలి. అలాంటిదే అమరకవిత నా దృష్టిలో" అని అంటారు మన మందరాచారిగారు. వీరి కవిత్వమున కట్టి అమరత్వమెన్నడో సిద్ధించింది. అమర కవిత్వ మును అందించిన అమరకవి ఈయన.



# శ్రీ ఆలూరు రామశాస్త్రి

జననము :- 9—6—1911

తల్లి:- శ్రీమతి గంగమాంబ; తండ్రి:- ఆలూరు నరసింహశాస్త్రి

జన్మస్థలం:- మలయనూరు-కల్యాణదుర్గం తా॥ అనంతపురం జి॥

ఆంధ్ర, కర్ణాటక సరిహద్దు ప్రాంతములందు పుట్టి పెరిగిన కొందరు కవి పండితులకు ఆ రెండు భాషలయందును రచనలు గావించెడి నేర్పు పుట్టుకతోనే అబ్బిన ఒక పుణ్యవిశేషము. దానికితోడు సంప్రదాయ కుటుంబంలో పుట్టిన మరికొందరికి సంస్కృత వాఙ్మయములో సంపూర్ణ ఆధిక్యత లభించుట బంగారుకు తావి అబ్బినట్లే కదా! ఆంధ్ర, కన్నడ సాహిత్యములకు వారు వారధిగట్టి అనర్ఘరత్నములను ఇరువైపులా పంచిరి. అట్టి వారు మన రాయలసీమలో పెక్కు మందున్నారు. వారిలో శ్రీ ఆలూరు రామశాస్త్రి గారొకరు.

శాస్త్రిగారు పాఠశాలలో విద్య గరిపినది తక్కువేయైనను, ఇంట తండ్రిగారి వద్దనే అమరము, శబ్దరత్నావళి, సంస్కృత సాహిత్యాభ్యాసము, రఘువంశాది పంచకావ్య పఠనములను క్షుణ్ణముగా నేర్చిరి. కీ॥ శే॥ సముద్రాల నారాయణశాస్త్రి గారితో కలిసి అప్పుడప్పుడు గీర్వాణ సాహిత్య ప్రసక్తి, చర్చలు, ప్రసంగాలు, ఆంధ్ర కావ్యములను గూర్చి భాషణ, సరిహద్దు

ప్రాంతీయ భాషయగు కర్ణాటక భాషా కావ్యములను గూర్చి చర్చించి వారిద్వారా అనేక విషయములు నేర్చిరి. జీవికకు వైదికవృత్తిని వదలక పిత్రార్జితమైన స్థిరాస్తితో కాలము గడుపుచుండిరి.

40ఏండ్లు దాటిన తరువాత శాస్త్రిగారికి తెనుగునగల సుమతి శతకమును, భాస్కరశతకమును, కన్నడములోనికి అనువదింపవలెననెడి ఒక ఆలోచన పొడసూపి, ఆ కార్యమునకు పూనుకొనిరి. సుమతి శతకము 1955లో కన్నడమున ముద్రింపబడి, బహుళ ప్రచారములోనికి వచ్చెను. తదుపరి కీ॥ శే॥ శ్రీ వడ్డాది సుబ్బరాయ కవిగారి శ్రీ సూక్తి వసుప్రకాశమను గ్రంథము నుండి దాదాపు 4, 5 శతకములను కన్నడములోనికి అనువదించిరి. కాని వాటిని ప్రచురించుటకు మూలకర్తగారి సర్వస్వామ్య సంకలితాధికారము లెవరినుండి పొందవలెనో తెలియక ప్రచురింపబడలేదని కవిగారు తెలిపిరి. ఈ విధముగా ఈఉభయ భాషలందును అనువదింపబడిన ఇండ కావ్యములు దాదాపు 12కు పైగా ఉన్నవి. "శ్రీ రాధాకృష్ణ ప్రణయము" వీరి స్వకపోల కల్పితాంధ్ర పద్యకావ్యము.

ఇక వీరు కన్నడమునుండి తెలుగులోనికి అనువదించిన భాగములు కొన్ని కలవు. వాటిలో కర్ణాటక జైమిని భారతము నందలి చంద్రహాసచరిత్ర, శ్రీ రామాశ్వమేధము అను వారికే

పాకభాగములను, ఆంధ్రభాషలో కదళీ ద్రాక్షాపాకములలో అను వదించిరి. వీరి రచన మచ్చునకు చూతుము.

అరయఁగ గౌతమపత్నిపై గుహునిపై యా యంజనా సూనుపై
చిరకాలంబు దపింప నా శబరిపై శిష్టార్థుడౌ పక్షిపై
మరణోత్కంఠు జటాయువుపై వుడుతపై, మౌనుల్ గనఁగ వారిపై
కరుణఁగ జూపిన రామచంద్ర మది నిన్ గాంక్షించెదన్ బ్రోవవే!

సుమతి శతకములోని ఒక సుప్రసిద్ధ పద్యమునకు వీరి కన్నడానువాదమిది.

వరనిగె సిరిబందాగెతావ్
బరువరు బంధుగళు కేళదు యంతన్నల్
కెరెయొళగె నీరు తుంబిరే
బరువవు కప్పిగళు హత్తుసావిర సుమతీ

ప్రస్తుతము ఈ కవిగారు కర్ణాటకరాష్ట్రమునకు చెందిన చిత్రదుర్గం జిల్లా పరశురాంపురంలో సత్య శోధనాలయ మందు నివసించుచున్నారు. వీరికి భగవంతుడు ఆయురారోగ్యభాగ్యము లిచ్చి కాపాడుగాక!



# శ్రీ వేదాంతం నరసింహారెడ్డి

జననము : 1—5—1911

తల్లి: వేదాంతం సుబ్బమ్మ; తండ్రి: వేదాంతం నంజుండరెడ్డి

జన్మస్థలము; తలమర్ల - సత్యసాయి తా॥ - అనంతపురం జిల్లా

అనంతపురం జిల్లాలోని తలమర్ల గ్రామములో పుట్టిన కవికుమారు లందరూ ప్రకృతిమాత ఒడిలో పెరిగి పెద్దవారైన వారే. మధురకవి బెళ్ళూరి-తలమర్ల కళానిధి-వేదాంతం నరసింహారెడ్డి ముప్పురూ ఆ ప్రకృతిమాత అనుంగుబిడ్డలే. మధురకవి బెళ్ళూరి వారి స్నేహమువల్ల వేదాంతం నరసింహారెడ్డి కవితా కన్య వలపునబడి, స్వయం కృషితో కవిత్వము నభ్యసించి కృతకృత్యులైరి.

పుట్టింది రెడ్ల వంశములో, పెరిగింది జనపదములో, చేపట్టింది కర్షకవృత్తి. అట్టి వాతావరణములో పెరిగిన మన నరసింహారెడ్డి కవిత్వం కూడా అదే వాతావరణంలోనే చొచ్చి పోయింది. "ఉదయిని" అను పేర ఐదు భాగములుగా వీరు వ్రాసిన చిన్న ఖండకావ్యములలోని ప్రతి పద్యము ప్రకృతి సౌందర్యంతో నిండివుంది. "సనాతన, అధునాతనల సమీకరణంలో సారము దీయగల నేర్పరులు వీరు."

వీరి ఉదయిని చతుర్థ గుచ్ఛమునందు "వల్లీజీవితము"

అను ఖండికలో - పల్లెలందు సాయం సంధ్యాకాల మెట్లుందునో కనులకు కట్టినట్లు వర్ణించినారు. దానిని కొంత ఈ క్రింది పద్య ములో చూచెదముగాక:

చెరగుబిగించి, వెంద్రుకలుజీరగ్గ పైటదొలంగి పోయినన్
నెఱుగని పల్లెటూరి పనికేగిన ప్రాయపు టందకత్తెలే
యరిగిరి సాంధ్యకాంతు లలమన్ గృహకృత్యముదీర్చు కాంక్షతో
కరము ప్రియోక్తులాడుచు వికావిక నవ్వుచు సౌరుగుల్కుచున్

రెడ్డిగారి పెక్కురచనలు సుబోధిని, సాధన, ఆంధ్రప్రభ, గృహలక్ష్మి, రేనాడు, ఆంధ్రపత్రిక మొదలైన పత్రికలందు వెలుగుచూచినవి. తమకున్న సాహిత్యాభిమానంకొద్ది తలమర్ల లోనే సారస్వత సమితిని స్థాపించి, దానికి అధ్యక్షులైరి. ప్రతి సంవత్సరం ఉగాది-దసరా-సంక్రాంతి కానుకలుగా చిన్న పుస్తక ములను ప్రచురింపబూనిరి. 1948లో "వసంతకానుక" యను చిన్ని సంకలనము మాత్రము విడుదల చేసిరి.

1) ముక్తికావ్యము 2) శ్రీసుందరుని ఆత్మబోధామృతము
3) అన్నపూర్ణకుమారి 4) నరసింహయోగి శతకము
5) హృదయార్పణము 6) పరిపూర్ణానందము (వచనము)
7) బ్రహ్మజ్ఞాని (వచనకావ్యము) వీరి అముద్రితకృతులు.

రెడ్డిగారు "శ్రీసాయి స్మరణామృతము" నందు శ్రీసాయి

బాబాగారిని గూర్చి యిట్లు ప్రార్థించిరి.

నిన్నుధ్యానింతు నీలోన నిమిడిపోవ
ఆత్మ తత్త్వంబు నందేల ననుదినంబు
ప్రేమరాజ్యంబు నేలంగ పెదకుబోని
బుద్ధి దయచేయు శ్రీసాయి పొంగి తలతు.

కవిగారికి శ్రీ సాయినాథుని కరుణాకటాక్షములు ప్రాప్తించుగాక!

---

## శ్రీ రత్నాకరం వెంకటేశ్వరులు

జననము :- 1910

తల్లి: శ్రీమతి శేషమాంబ; తండ్రి: శ్రీ హొన్నూరాజు

జన్మస్థలం : వెంకటాద్రిపల్లి – ధర్మవరం తా॥ అనంతపురం జిల్లా

శ్రీ రత్నాకరం వెంకటేశ్వరులుగారు భట్రాజు కులమున జన్మించి, వృత్తిరీత్యా ఆయుర్వేద వైద్య విద్యను చేబట్టి, పుట్టుకతో అబ్బిన కవిత్వమును మరువక తనకు తోచిన రీతిలో తగినంతగా సాహిత్యసేవ గావించుకొన్న నిరాడంబరులు వీరు.

వైద్య వృత్తిరీత్యా గ్రామాంతరములకు వెళ్ళినప్పుడు అక్కడి ప్రజలలోగల మతవైషమ్యములు, అన్యోన్య కలహముల

దుర్భర దారిద్ర్యజీవితము, ధనికులు స్వార్థ పరత్వముతో చేయు దుంతగములను చూచినప్పుడు కవిగారి హృదయము కలత చెందినది. అప్పుడే వారి హృదయాంతర్గత సాహితీ విపంచి తీగమీటినది. తమలోని ఆవేదనను పద్యరూపమున లలితాంబకు నివేదించుకొనిరి. దానిని "శ్రీ లలితా పుష్పమాల"గా వెలుగు లోనికి దెచ్చిరి.

"మాతృబోధ" యను వీరి చిన్ని పుస్తకము నీతి ప్రబోధకమైనది. ఒక మాతృమూర్తి తన అనుంగు కూతురును "పుత్రికా" యని సంబోధించుచూ చెప్పిన నీతి పద్యములివి. "నీ ముదిప్రాయంబున నిన్ను జూడవలదే మోదంబుతో కోడలున్" అని ఆ తల్లి కూతురుని మెల్లగా మందలిస్తుంది.

వీరు రచించిన భక్తి గ్రంథములలో శ్రీ వెంకటేశ్వర పుష్పమాల, శ్రీకృష్ణవర్ణ మాల, శ్రీసత్యసాయిస్తుతి రత్నాకరం, శ్రీ వేంకటేశ్వర కల్యాణము (గేయము) శ్రీ భగవద్గీతా గద్య పద్యగేయామృతము, శ్రీ హనుమద్విజయము (గేయము) శ్రీ వాల్మీకి రామాయణ సుందరకాండము ననుసరించి రచించిన గేయ కావ్యములు ప్రసిద్ధములుగా చెప్పకొనదగినవి.

గేయములలో వ్రాయబడిన పై మూడు గ్రంథములు స్త్రీలు, బాలురు, పామరులు తమకు తోచిన రాగతాళములలో

పాడుకొనుటకు అనువుగా రచించిరి. పాదమునకు ముప్పదిరెండు మాత్రాగణములతోకూడి ప్రాసయతిగాని, సాధారణయతిగాని కలిగియున్న గేయములివి. శ్రీ వేంకటేశ్వరుని ఎందరో మహానుభావులు ఎన్నెన్నోరీతులుగా స్తుతించినారు. ఆతని దివ్యాద్భుత చరిత్ర ఎన్నిసార్లు వ్రాసినను, చదివినను, ముక్తిదాయకమే కదా! ఇతరులను మెప్పించవలెననెడి తలంపుతోగాక, కవిగారు తమలో పొంగి పొరలివచ్చు భావావేశము నణచుకొనజాలక తమకు తాము తృప్తిచెందు నుద్దేశ్యముతో ఎల్లరుసూ పాడుకొనుటకు అనువుగా రచించి ధన్యత పొందిరి. ఈ వేంకటేశ్వర కల్యాణమును గానము చేయువారికి శ్రీయుత యం.యస్. రామారావుగారి సుందరకాండ రామాయణమును తలపుకు దెచ్చును,

ఇందు తొండమానుని జననము, పద్మావతి జననము, వకుళాదేవిచరిత్ర, వేంకటపతివేట, పద్మావతి పూర్వజన్మ కథ, పద్మావతి వేంకటేశ్వరుల కల్యాణము ప్రధాన ఘట్టములు. "శ్రీ వెంకటేశ్వరుని కల్యాణము చేసెద గానము శ్రీహరి కృపచే" అను పల్లవితో నీ గేయములను సాగించిరి. గేయరూపమున రచించిన ఈ కృతులు ఆంధ్ర సాహిత్యమునందు ఒక ఉన్నత స్థానము నందగల వనుటలో సందేహములేదు.

శ్రీ వేంకటేశ్వర కల్యాణమునందు శ్రీమన్నారాయణుడు ఎరుకలసాని వేషము ధరించి, పద్మావతి కడకొచ్చి సోదె చెప్పిన

విధమును కవిగారు బహు ముచ్చటగా వ్రాసిరి. అందలి ఒక వరుస గేయములో మచ్చునకు కొంత చూతుము. పద్మావతితల్లి ఎరుకలదానిని ఆ యువకుని వివరములను గూర్చి అడుగగా ఎరుకలసాని యిట్లను చున్నది.

సేసాశలమున సికరము మీదను
సేరెను తల్లీ నారాయనుడే
ఆదిదేవుడై యందరి మొక్కులు
నందును సేరెను వెంకటపతియై
సదివినవాడూ సకల విద్దెలను
సక్కనివాడూ మనుమతుకన్నా
దనమూ బలమూ దండిగ యుండూ
శీనివాసుడని సెప్పుదు రతనిని.

వీరి శ్రీ భగవద్గీతా గద్యపద్య గేయామృతము ఒక పెద్ద గ్రంథము. ప్రస్తుతము ముద్రణలో వున్నది. శ్రీ భగవద్గీత మూలము ననుసరించి ఇందు 701 పద్యములు, 701 గేయములు, 701 గద్యములు గల్గి సుమారు 1200 పేజీలకు తక్కువకాని గ్రంథరాజమిది. "ఇదివరలో వచ్చిన పెక్కు అనువాద గ్రంథము లన్నింటికి ఇది తలమానికము కాగలదనుటలో గొప్పేమీలేదు" అని శ్రీ కలచవీడు శ్రీనివాసరావుగారు ప్రశంసించిరి.

ఇంకనూ, ముద్రణ కావలసిన వీరి సుందరకాండగేయం,

శ్రీ హనుమద్విజయములు కూడ త్వరలో ముద్రింపబడి ఆంధ్ర లోకమును అలరించును గాక! వీరికి శ్రీ వేంకటాచలపతి ఆయురారోగ్య భాగ్యములనిచ్చి కాపాడుగాత!



## శ్రీ వెంకట వరదాచార్యులు

జననం: 2-5-1910

తల్లి: శ్రీమతి వెంకటమ్మ

తండ్రి: వెంకటపాపాచార్యులు

జన్మస్థలము: బొందలదిన్నె. తాడిపత్రి తాలూకా. అనంతపురం జిల్లా

శ్రీ వెంకట వరదాచార్యులవారు బాల్యమునుండియే సంగీత, సాహిత్య, జ్యోతిష శాస్త్రములందు అభిరుచి మెండుగా గలిగి వుండిరి. 20వ ఏటనే నాటకములందు నటించుచుండిరి. 26వ ఏట వైద్యము చేబట్టిరి. జ్యోతిష గ్రంథములను పరికించి, పరిశోధించి కృత్రిమశాస్త్రమును విడచి "సప్రమాణ జ్యోతిస్సారము" అను గ్రంథమును 1973లో వ్రాసి ప్రచురించిరి.

1964లో వీరు వ్రాసిన "మాతృజ్యోతి" నవల డెమ్మీ సైజులో 630 పేజీలు గలదు. దీనిని కవిగారు నవలగా వ్యవహరించిరేగాని యిందు ఉత్కంఠత కల్గించు కథావస్తువు లోపించి, భారతీయ ఆచార వ్యవహారాదులు, సాంప్రదాయములు, నీతి నియమములు, ధర్మనిరతి మున్నగు అనేక విషయములకే ప్రాధాన్యత యివ్వబడినది. వాడుకభాషనే వాడినప్పటికి ముఖ్యముగా కథాగమనము కుంటువడుటచే పాఠకుడు చదువుటకు ఆసక్తిపడడు. రచయిత తనకు తెలిసిన పెక్కు విషయముల నన్నింటిని గ్రంథస్థము చేయవలెననెడి తీవ్రతయే అధికముగా ఉన్నట్లు కనిపించును.

ఇక ఈ కవిగారికి జ్యోతిశ్శాస్త్రమునందపారమైన వైదుష్యము గలదనుటకు "జ్ఞానజ్యోతి"-శ్రీ గణేశ నారదసల్లాపములు శ్రీ శారదా గణేశ వరప్రసాద వధూవరులు - అను ద్విపాత్ర ఏకాంక నాటిక సాక్ష్యములు.

తాడిపత్రిలో శ్రీ రాఘవేంద్ర జ్యోతిషాలయమును స్థాపించి వంశ పరంపరానుభవ వైద్యమును, జ్యోతిశ్శాస్త్రమును ప్రజలకు అందించుచున్నారు. వీరికి శ్రీ రాఘవేంద్రయతీంద్రుల వారు ఆయురారోగ్య భాగ్యములనిచ్చి కాపాడుగాత!





## శ్రీ లింగుట్ల కోనేటప్ప

జననము :- 10-12-1910

తల్లి :- శ్రీమతి రంగమ్మ

తండ్రి :- వెంకటప్ప

జన్మస్థలము : ఛాయాపురము

గుత్తి తాలూకా

అనంతపురం జిల్లా.

అనంతపురం జిల్లాలో అజ్ఞాతంగా జీవించిన కవులలో లింగుట్ల కోనేటప్ప గారొకరు. జన్మించింది కమ్మకులము, చదివింది ఎనిమిదవ తరగతి, చేపట్టిన వృత్తి వ్యవసాయము. అభిరుచులు - నాటకములు, శాస్త్రీయ సంగీతము, జ్యోతిశ్శాస్త్రం, వైద్యవిద్య. వీరు సేకరించిన మాండలిక పదకోశ నిర్మాణము వ్యవసాయము - చేనేత; రెండు భాగములుగా ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు ప్రచురించుట ఎంతయో ముదావహము.

తదుపరి వీరి "వంశరత్నాకరము" అకారాది నిఘంటువు. అముద్రితము. దాదాపు ఇది ఒక వేయిపుటల గ్రంథము. "అ నుండి "ళ" వరకుగల సాముదాయిక నిఘంటువిది. దీనిని కవిగారు బహుళ కృషితో తయారుచేసిరి. ముద్రణాభాగ్యము పొందలేదు.

వీరు కొన్ని శతకములు కూడా వ్రాసినారు. ఏకప్రాస కంద పద్య దశరథరామ శతకము, యువతీ శతకము, ఈ రెండునూ అముద్రితములే. దశరథరామ శతకములోని ఒక పద్యము మచ్చునకు

కం॥ కరిఁబ్రోవ మకరి జంపితి
మురిపెముతో కంతు జనక, మోక్షపురీశా;
హరి, నను నేలవదేలర?
దరి జేరితి ఛాయపురము దశరథరామా!

"ఆధునిక సుమతి శతకము" అనునది వీరి ఒకే ఒక ముద్రితకృతి. జాతీయోద్యమము ముమ్మరముగా సాగుచున్న రోజులలో మన సమాజములోవున్న ఒడుదుడుకులను తెలుపుతూ వ్రాసిన శతకమిది. చిన్నతనపు వీధి బడిలో కంఠస్థము చేసిన బద్దెన సుమతి శతకపు పోకడలు అచ్చటచ్చట నెమరువేసిరి. "నాయీ రచన కొన్నిచోట్ల ఛాందస మహానుభావులకు వెగటు గల్గించినా ప్రజాబాహుళ్యము ఈ శతకాన్ని ఆదరించగలదని నా నమ్మిక" అని కవిగారు వ్రాసుకొనిరి. మచ్చుకా పద్యములు.

పదవీ వ్యామోహంబున
పదిలముగా జనులచుట్టు పనివడి తిరుగున్
పదవి లభించిన పిమ్మట
వదలును ప్రజ కార్యమెల్ల స్వార్థుడు సుమతీ

పదవులకు ప్రాకులాడెడి
ఉదరంభరి కెపుడుగాని ఓటియ్యకు మీ
యెదలో ప్రజమేల్ దలచెడి
సదయుని యెన్నికకు నిమ్ము సమ్మతి సుమతీ!

కోనేటప్పగారు వందల కొద్ది జానపద గేయములను సేకరించినట్లును, వీరి వద్దగల అమూల్యగ్రంథములు, అముద్రిత ప్రతులు ఎన్నో బంధువుల, స్నేహితుల యిండ్లలో వుండిపోయినవనియు, తుదకీ ఒక్క శతకము మాత్రమే లభ్యమై ముద్రణా భాగ్యము పొందినదని వారి కుమారులు లింగుట్ల వెంకటప్పపై శతకములో వ్రాసుకొన్నారు. ఈ కవిగారి కుటుంబమునకు దశరథ నందనుని అనుగ్రహము సదా లభించుగాక!

---

## శ్రీ గాజుల వెంకటరమణప్ప

జననము :- 9—11—1917

తల్లి: శ్రీమతి నంజమ్మ; తండ్రి : శ్రీ వెంకటప్ప

జన్మస్థలం : కొత్తచెఱువు - సత్యసాయి తా॥ అనంతపురం జిల్లా

జీవనోపాధికై ఉపాధ్యాయవృత్తిని చేబట్టిన శ్రీ గాజుల వెంకటరమణప్పగారు వృత్తిరీత్యా తలమర్ల గ్రామమునకు ప్రధానోపాధ్యాయులుగా వచ్చుట సంభవించినది. చిన్నతనము

నుండి పద్యరచనపై మక్కువగల వెంకటరమణప్పగారు తాము వ్రాసిన రచనలకు వెలుగుచూపక ఎందులకో నిరుత్సాహపడు చుండుట తలమర్లలోని శ్రీ కళానిధిగారు చూచి, వీరిని ప్రోత్సహించి, తమ గురువులైన శ్రీ మధురకవి బెళ్ళూరి శ్రీనివాస మూర్తిగారితో పరిచయము గావించిరి. అప్పటికే తలమర్లలో సారస్వత సమితి స్థాపింపబడి అందలి సభ్యులైన శ్రీ వేదాంతం నరసింహారెడ్డి, కళానిధి, బెళ్ళూరి వారలు తీవ్రమైన కృషి సాగించుచూ కవిత్వతత్త్వాన్ని చర్చించుకొంటు వుండేవారు. అప్పటి ఈర్ష్యాలోకం కోమలమైన ఆ కవితాకన్యపై దుమ్మెత్తి పోసి రాళ్ళు విసురుతూవున్నా వారి వెట్టి వారికానందమన్నట్లుగా ఆ కవిమిత్రు లుండిరి. ఆ కవిమిత్రుల సాంగత్యము వెంకట రమణప్పగారికి లభించింది. అందుకే వారు తమ "భావోదయము" అను కవితా సంపుటిలో బెళ్ళూరి వారిని గూర్చి యిట్లు ప్రశంసించిరి.

నీవు జనించి మించిన పునీత తలమ్మ్రన నే వసించుటఁ
భావరసోల్బణంబు దయివార నొకింత కవిత్వ వాటికన్
తావులు గ్రుమ్మరింపగల దార్ఢ్యమునందగ గంట సాహితీ
సేవయె జీవనంబగు వశీకృత చిత్తుఁడ వీవు సత్కవీ!

అప్పటినుండి వెంకటరమణప్పగారు కూడ ఆ సమితిలో సభ్యులై తమ "భావోదయము" అను ఖండకావ్యమును ఆ

సమితి ద్వారా వెలువరించిరి.

వీరి కవిత్వము ప్రాచీన కవితాపద్ధతిలో కొంత: నవీన కవితామార్గమున కొంత సమ్మేళనమై యుండును. వీరిది జిగిబిగి కల్గిన చక్కటిశైలి. భగవద్దత్తమైన భావనాశక్తిగల వీరి కవిత్వము జీవంతో కూడుకొన్నదనుటలో సందేహంలేదు. ఈ కవి తన మనోకాంక్ష నిట్లు తెలుపుకొన్నారు.

అడ్డు పాటుల నెల్లను నధిగమించి
వనధిఁజేరంగ నరుగు స్రవంతియట్లు
స్వార్థయుతమగు సంఘ నిబంధనముల
ద్రోసి, స్వాతంత్ర్య సీమయందున వసింతు.

"ఈ కవి సాహిత్యజీవి. శాశ్వతములైన తన భావములకు స్వరూప మిచ్చితీరవలె ననెడి యుద్దేశ్యము కలవాడు. ఇట్టి సాహితీ సమారాధకులు చాలామంది కానరారు. కాబట్టి అభ్యుదయము వీరి సహజలక్షణము" అని బెళ్లూరివారు ప్రశంసించిరి.

వీరు వ్రాసినవి రెండు ఖండికలేయైననూ చక్కటి రచనలను తెలుగువారి కందించి రనుటలో అతిశయోక్తి లేదు. ఇరువదేండ్ల కాలము శ్రీ శ్రీ శ్రీ భూమానంద భారతీస్వాముల వారిని సేవించిన ఫలముగా తనకీ రచనాశక్తి అబ్బినదని కవిగారు చెప్పుకొన్నారు. వీరిపై భూమానంద స్వాములవారి కృపాకటాక్షములు సర్వదా ప్రసరించుగాత!

---



## శ్రీ మీసరగండ పుల్లమరాజు

జననము :- 10-11-1919

తల్లి: లక్ష్మీనరసమాంబ

తండ్రి: మీసరగండ ఓబరాజు

జన్మస్థలము : తరిమెల

అనంతపురం తా॥ - జిల్లా

మీసరగండ బిరుదాంకిత పండిత వంశమందు జన్మించిన మీసరగండ ఓబరాజు సుప్రసిద్ధ పౌరాణికులు, సంస్కృతాంధ్ర పండితులు, అనంతగిరి విలాస బాలరామాయణ కర్తలు. వీరి కుమారులే మన పుల్లమరాజు కవిగారు. పుల్లమరాజుగారు బాల్యముసుండియు తండ్రి వద్దనే ఆంధ్ర పంచకావ్యములను పాఠ మొనర్చిరి. తదుపరి తరిమెల వాస్తవ్యులు, సంస్కృత భాష యందు గొప్ప పాండిత్యముగల కీ॥ శే॥ రామాయణము శంకర శర్మగారి వద్ద సంస్కృత పాఠము నేర్చిరి. సంగీత, నాటకము లన్న చిన్నతనమునుండి వీరికి అభిరుచి మెండు.

ఉన్నతపాఠశాల విద్యాభ్యాసము అనంతపురంలో ముగించి 1938-40 సం॥ మధ్య అక్కడే ఉపాధ్యాయ శిక్షణపొంది, తదు

షరి మద్రాసు యూనివర్సిటీలో తెలుగువిద్వాన్ పట్టము స్వీక రించిరి. తొలుత బళ్ళారి పురపాలక సంఘంలో గుమాస్తా ఉద్యో గములో చేరి, తరువాత గుంతకల్, బుక్కరాయసముద్రము, పెనుకొండ పట్టణములందు తెలుగు పండితుడుగా పనిచేసి, తుద కక్కడి ప్రభుత్వ జూనియర్ కళాశాలలోనే ఆంధ్రోపన్యాసకులుగా పదవీవిరమణ గావించిరి.

ఉపాధ్యాయులుగా ఉన్నప్పుడే వీరు కొన్ని నాటకములను రచించి వాటిని విద్యార్థులచేత ప్రదర్శింపజేసి, అనంతపురం జిల్లా యందేగాక గుంటూరు మున్నగు ప్రాంతములందు కూడ బహు మానములు పొందిరి. వీరు రచించిన నాటకములు స్వర్ణప్రతిమ, రజనీకాంతం, ఆదర్శసమితి. ఇవి అముద్రితములు. మధుకణ ములు ఖండికలు; కాంగ్రెస్ చరిత్ర-జంగంకథ; ఇవి ముద్రితములు.

మధుకణములు ఒక ఖండకావ్యము. కవిగారు మధుర భావావేశములు పొందినప్పుడెల్లనూ వ్రాసిపెట్టిన పద్యరత్నము లివి. హిందీ పద్యభాగములను కూడా కొన్ని అనువదించి యిందు చేర్చిరి. ఇందలి "మాతృప్రేమ" ఖండిక ఎంతటి కఠి నాత్ముని హృదయమునైననూ ద్రవింపజేయు ననుటలో సందే హములేదు. వేశ్యాలోలుడైన ఒక బ్రాహ్మణ యువకుడు తన ప్రేయసి తలనొప్పి బాపుటకు, ఆమె కోరికమేరకు తల్లిగుండెను దెచ్చుటకు ఏమాత్రము జంకక తల్లికడకు వెళ్ళినాడు. మాతృ

హృదయమ్ము మసిజేసి మాదునకు పూసిన ఆ వేశ్య శిరోభారము తగ్గునట. అతడీ విషయము తల్లికి చెప్పినాడు. ఆమె కుమారుని కోరికను కాదనలేదు. ఆమెను కత్తితో పొడిచి చంపి ఆ చల్లని తల్లిగుండె తీసుకొన్నాడు.

గుండియ చేతబట్టి చెలికోరిక దీర్చెద వేగ నంచు ను
ద్దండత నేగుచో శిలనుదాకి పదమ్మటు దొట్రిలంగ, నా
గండడు నేలపైబడియె; గ్రచ్చుఱ గుండియయార్చె నాయనా!
మెండగు దెబ్బదింటివో సుమీ మెలమెల్లన లెమ్ము పుత్రకా!

ఇట్టి రసవత్తర ఖండిక లెన్నియో ఈ మధుకణముల సంపుటిలో చోటు చేసుకొన్నవి. ఉద్యోగ విరమణానంతరము వుల్లమరాజుగారు పుట్టపర్తి శ్రీ సత్యసాయిబాబా సన్నిధిలో కాలము గడుప నిశ్చయించి, కర్ణాటకలోనివారి వైట్ ఫీల్డ్ పరిశాంత నిలయములో ధార్మిక చింతనలో కాలము బుచ్చుచున్నారు. వీరికి శ్రీ సత్యసాయి ఆయురారోగ్య భాగ్యము లందించుగాత!



# శ్రీ కోగిర జయసీతారాం

జననము :- 14—11—1924

తల్లి : శ్రీమతి గౌని చెన్నమ్మ: తండ్రి : శ్రీ గౌని ఓబులరెడ్డి

జన్మస్థలము :- కోగిర - పెనుకొండ తా॥ అనంతపురం జిల్లా

నిఱుపేద కుటుంబములో పుట్టిన శ్రీ కోగిర జయసీతారాం గారు చిన్నతనమునుండి గడ్డుజీవితమును గడిపినవారే. చదివిన ఎనిమిదో తరగతికి ఉపాధ్యాయవృత్తి లభించే మంచికాలమది. పల్లెల్లోనే, ఆ పేదప్రజలనడుమ నిత్యము కలిసిమెలసి తిరుగుతూ ఆ ప్రజాజీవితాన్ని, భాషను, ఆచార వ్యవహారాలను, వారి జీవితానుభవాలను, మనోగతాలను పూర్తిగా తన రక్తంలో జీర్ణింపజేసుకొని, వారికోసం, వారిభాష, పలుకుబడులతో, వారి కష్టాలను పాలుపంచుకొనే ఒక మనిషి తానంటూ, తన మనో విపంచిని విప్పి కవితలల్లి ప్రజల ముందుంచిన ప్రజాకవి శ్రీ కోగిర జయసీతారాం.

వీరివి అనంతపురం జిల్లా ప్రజాభాషకు అద్దంపట్టే రచనలు. ఈలాంటి మాండలిక భాషారచనలు చేయగలిగిన కవులు చాల అరుదు. ఆ పద్ధతి ఒంటబట్టడం కూడా కష్టమే. అందుకే ఈ కవి సామాన్య ప్రజానీకానికి జరుగుతున్న అన్యాయాలను చూచి సహించలేక కవితలల్లితే, ప్రభుత్వము దాన్ని ధిక్కార నేరంగా లెక్కించింది, బెదరించింది.

"సలిమంట" అనే కవితలో సామాన్య పల్లెకూలీల దినదినగండపు జీవితాన్ని పుడిసిట బట్టినాడీకవి. ఆ కవిత సాధారణమాటల్లో సాగిపోయినా అది ఛందోబద్ధంగా వుంది. చక్కటి భావరమ్యతను కలిగి ఉంటుంది. జీవితంలో పండి పోయిన ఓ అవ్వ శరీరాన్ని కొరుక్కుతింటున్న చలికి ఓర్చుకో లేక, వాళ్ళను వీళ్ళను పలకరించి, చలి మంటేసుకొంటూ, తన వాళ్ళను పనులకు పురమాయించుతూ, చుట్టుప్రక్కల వాళ్ళను విచారించడం ఇందులో వస్తువు. జనం, జీవం అవ్వ మాటలకు ప్రాణం. సంభాషణావిధానంలో రచన సాగుతుంది.

ఆడ బొయ్యేదెవ్రు? ఆదిగా - "యాలవా"
"అగ్గిపెట్టి వుంద అనుముగా; నితావ?"
"వూను వుందితాలు నేనంటిత్త"

——— ——— ———

"కవ్కొనేకి యేస్తి కప్పడమూలేదు
దుప్టి గొందమంటె దుడ్లులేవు
తొలుపుల్యాక వాకిలికి తడకడ్డం బెట్కోని
యేటి బతుకొ యేమొ యల్లకాల్మ"

"—యంగటమ్మా! లేత్వ, యింగా లేదా"
"ఏం, లేశ్నవత్తా! యెసురెంత బెట్టల్లి"
"రాండు జెస్లుబెట్టు; పిండి వుందా"

"యాడదిప్డు రాగులిసురల్ల; యెసర్లోకి
"సందకాడ వురికె సత్తా రంద్రు...."

ఇలా అత్తకోడళ్ళ సంభాషణ జరుగుతుంది. తుదకది "కుటుంబ సంక్షేమా"నికి దారి తీస్తుంది. ఈ విధంగా ఈ కవికి పల్లీయుల జీవితంలోని నొక్కుల్ని, లోతుల్ని పసిగట్టే శక్తి వుంది. అందుకే ఈ కవి "ఆత్మగతం" అనే శీర్షికలో వ్రాసిన కవితలో ఇలా వ్రాసుకొన్నారు.

పిన్న పదమునందు పెద్దభావము పొందు
నేర్పు గలుగువాడె నిజము సుకవి
కొద్ది పొలమునందు కొండంతపంట, పం
డించు నట్టివాడె మంచిరైతు.

"నిట్టూర్పులు" - పద్యకావ్యం; విజయప్రభ - బుఱ్ఱకథ; ఈ రెండునూ వీరి ముద్రిత కృతులు. తక్కినవన్నియూ వ్రాత ప్రతులుగానే మిగిలివున్నాయి. వీరు "సుగుణా!" అను మకుట ముతో వ్రాసిన 400 పద్యముల శతకములో నేటి భారతదేశపు రాజకీయ వ్యవహారములను, స్థితి గతులను తూర్పారబట్టిరి. అలాంటిదే వీరి "మదాంధబరాతము"కూడ. ఇది తేటగీతికలలో కూర్చబడినది. ఇందు ధూర్తరాష్ట్రుడు (ధృతరాష్ట్రుడు కాదు) సంశయునితో(సంజయుడుకాదు) ఏ మడుగుచున్నాడో చూడుడు.

గీ॥ భరతభూమి స్వతంత్రమై ప్రజల పాల
నమ్ము ప్రారంభమైనట్టి నాటినుండి
ధాత్రియెల్ల మహాకురుక్షేత్రమయ్యె
సంశయా! చెప్పుమా దాని సరళి కొంత!

కం॥ దేవుని ఎదుట ప్రమాణము
గావించిన సాక్షి యిచ్చు కైఫీయతులో
దేవిన దొరకని సత్యము
దేవు డపహరించెనేమొ తెలియదు సుగుణా!

(— సుగుణా! శతకమునుండి)

మన తెలుగు సాహిత్యంలో కవికోకిలలు, కవివృషభులు కవిసింహులు, కవికిశోర బిరుదాంకితులే ఎక్కువ. "కవికాకి" బిరుదాంకితులెవరూ ఉన్నట్లులేదు. "కవికాకి బిరుదును మీకిస్తున్నాం, తీసుకోగలరా?" అని ఒకసారి శ్రీ బి. టి. ఎల్. యన్. చౌదరి (అనంతపురం జిల్లా గ్రంథాలయసంస్థ-అధ్యక్షులు) గారొక సారి జరిగిన గ్రంథాలయ వారోత్సవాల విందుసభలో శ్రీ జయ సీతారాంగారిని ప్రశ్నించగా, నిస్సంకోచంగా ముందుకొచ్చి "నెమలి జాతీయపక్షి. కాకి ప్రజలపక్షి. నిత్యం వాళ్ళను మేలుకొలుపుతుంది. నేను అలాంటికవినే. నాకాబిరుదుతగిందే" అని సగౌరవంగా సభలో పలికి, గౌరవా గౌరములన్నింటినీ ఒకే స్థాయిలో మన్నించిన సుకవి ఈయన. ఈ కవిగారిని

శ్రీ చౌదరిగారు అత్యభిమానిస్తారు. "కవికాకిగారు! బాగున్నారా?" అని ఎక్కడ కనిపించినా నవ్వుతూ కుశలప్రశ్నలు వేస్తుంటారు. "అంతా నీ చలువేకదా! నాయనా!" అంటూ చౌదరి గారికి నవ్వుతూ జవాబిస్తాడీ కవి.

వ్రాసిపెట్టిన రచనలన్నీ వెలుగు చూడకపోయినా, వీరి రచనలన్నీ అనంతపురం జిల్లా సాహిత్యాభిలాషుల మనోఫలకాలపై చిరస్థాయిగా ముద్రింపబడినాయి. ఏ కవి సమ్మేళనం జరిగినా ఏ సాహిత్యగోష్ఠి జరిగినా, అభిమానులు కోరినా అక్కడికక్కడే తన సంచిలోని వ్రాతప్రతిని తీసి కవితలను వినిపిస్తుంటారు. 1. అరణ్యరోదనము (సీస పద్యములు) 2. కావ్ - కావ్ శతకము 3. కాకిగోల (గేయాలు) 4. పండు వెన్నెల (పిల్లలపాటలు) 5. కృష్ణార్జునయుద్ధము 6. రామాంజనేయయుద్ధము 7. సీతారామకల్యాణము(నాటకములు) 8. జయభారతి (బుడబుడక్కలకథ) ఇవి వీరి అముద్రితకృతులు.

సాధారణమైన ఉపాధ్యాయ జీవితాన్ని కొనసాగించినా, ఒక "అసాధారణమైన వ్యక్తి"గా లెక్కింపబడి తన పదునైన కలంతో చురకలంటిన ధైర్యశాలి. ప్రస్తుతము స్వగ్రామమైన కోగిరలోనే కాలం నెట్టుకొస్తున్నారు. భగవంతుడు వీరికి ఆయురారోగ్య భాగ్యములనిచ్చి సర్వదా కాపాడుగాక!



# శ్రీ విద్వాన్ విశ్వం

జననము :- 21—10—1915

తల్లి : శ్రీమతి లక్ష్మమ్మ; తండ్రి : శ్రీ రామయ్య

జన్మస్థలము :- తరిమెల; అనంతపురం తా॥ - జిల్లా

ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక పాఠకులకు విద్వాన్ విశ్వం గారి పేరు తెలినియదికాదు. అందలి "మాణిక్యవీణ" శీర్షిక చాలనాళ్లుగా వారు నిర్వహిస్తూ అనేక విషయములను వ్రాస్తున్నారు. పత్రికారంగంలో వీరి పేరు ఒక ఉన్నతస్థాయిలో వున్నది. పత్రికా రచయితగా, కవిగా, పండితుడుగా, అనువాదకుడుగా, సంపాదకుడుగా పేరు తెచ్చుకొన్న విశ్వంగారు ప్రస్తుతము తిరుపతి తిరుమల దేవస్థానంవారి ప్రచురణ విభాగంలో సంపాదకులుగా పని చేయుచున్నారు.

వ్రాసినవి లెక్కలేనన్ని పుస్తకాలేయైనా, విద్వాన్ విశ్వం గారనగానే జ్ఞప్తికి వచ్చేది "పెన్నేటిపాట" కావ్యమొకటే. అదే వారి కీర్తి చంద్రికలను ఆంధ్రదేశ మంతటా ప్రసరింపజేసినది. ఆ కావ్యముతో విశ్వంగారి పేరు తెలుగునాడులో మారుమ్రోగింది, తెలుగువారి హృదయాలలో ప్రతిధ్వనించింది.

రాయలసీమలో పుట్టిపెరిగిన ఈ కవివరేణ్యుడు తన అనుభవ మూలాధారముతో, ఈ సీమ నిజస్థితిగతులను యథాతథంగా

చిత్రీకరించారు. ప్రజల అష్టకష్టాలనుచూచి కన్నీరు కార్చిన మానవతావాది ఈయన. తన సీమనుగూర్చి తాను అతిశయోక్తిగా చెప్పుకొన్నా ఆ కవి నెవరేమి ఆక్షేపించువారు లేరుకదా! అందుకాయన మనసొప్పలేదు. అందుకు తావియ్యలేదు కూడా. ఎప్పుడో ఈ సీమలో రాసులుగా రత్నాలను పోసుకొని అమ్మినారట - అప్పుడది పచ్చలబజారు. అది గతించిన వైభవము. మరి నేడో, ఇదొక ఎడారి. ఇక్కడున్నది ఒకే ఒక నది - అది పెన్న. అందులో "ఏది నీరు? ఏదీ హోరు? ఏదీ నీటిజాలు? - ఇదే నీరు! ఇదే హోరు! ఇదే ఇసుకవాలు." అది ఒట్టి ఇసుకదిబ్బ. ఇప్పుడిక్కడ ఈ సీమవాసుల కన్నీరుతప్ప నీరులేదు. ఇక్కడి ప్రజల కడగండ్లను వివరిస్తూ, "నేటి రాయలసీమ కన్నీటి పాట - కోటి గొంతుల కిన్నెర మీటుకొనుచు, కోటి గుండెల కంజరి కొట్టుకొనుచు" వినిపింతునని ఆ కన్నీటిపాటను విశ్వంగారు ఒక మానవతావాదిగా పాడినారు.

పెన్నేటిపాట ఐదు సర్గలుగా వ్రాయబడింది. ఇందలి కథ - ఒక పెద్దరైతు నారపరెడ్డి ఏకైక పుత్రుడు రంగడు. ఆ తండ్రి ఉన్నప్పుడు పొగడిన వారందరికీ అడిగినంత యిచ్చి తుదకు "కొన్ని దినాలకు దత్రము సన్నవడం జొచ్చె, కీర్తి సంపద బలిసెన్" అన్నట్లుగా దివాలా తీసినాడు. అప్పుడు

గే॥ నారపరెడ్డి నారప్పయ్యెను
ఊరిమోతుబరి ఉప్పరియయ్యెను

దారిమోటులో పూరికొట్టమున
చేరెను తోడాక చిన్నరంగడే.

ఆ రంగడు తండ్రి గతించిన తరువాత పడిన ఇక్కట్లను, తడి ఆరని కంటితో, ఎద తడబడుతూ, మసకమసగ్గా కనిపించే అక్షరాలను తడుముకొంటూ చదివింపజేసే ఈ కవితకు నిజంగా అమరత్వం సిద్ధించింది. ఆ కష్టముల నొకమారు మనంకొంత పరామర్శింతము.

సీ॥ ఒకరింటి గాటలో ఊరిన గంజెల్ల
నెత్తిపోయుట కెంత యేడ్చినాడొ!
ఒకరింటి దొడ్డిలో నుండిన కసవెల్ల
నూడ్చివేయుటకెంత ఉడికినాడొ!
ఒకరింటి నట్టింటనున్న కొట్టలనెల్ల
దంచుటకెంత కంపించినాడొ!
ఒకరింట గంపలకున్న రాగులనెల్ల
విసరుటకెంతగా విసివినాడొ!

గీ॥ ఒకరి యింటిలో పిల్లల నూచుటకు, మ
రొక్కరింట పక్కలువేయ, నొక్కరింట
అరవచాకిరీ చేయుట కొఱకు; ఎంత
యెంత దురపిల్లెనో వాని యింతయెదద!

గీ॥ కటికకారము సంగటి గుటకవడక
ఎన్ని బిందెలనీళ్ళు త్రావించినదియొ!
ఎండు రొట్టిముక్కలు అఱిగింపుగాక
ఎన్ని మిరపగింజల నమిలించినదియొ!

కం॥ ఇవియుం దొరకక పుడిసెడు
గవి నీళ్ళంద్రావి ముడుచుక పరుండిన పా
డు విభావరులెన్నో, లె
క్కవిలే వరి యేది? వల్లకాటి మనుగడ౯.

ఈ కావ్యంలో రాయలసీమ పలుకుబళ్ళు, నానుడులు, మాటల తీరుతెన్నులు, వ్యవసాయ విధానము, ఆహార విహారాదులు, సీమవాసుల మనోగతాలు, ఇక్కడ లభించే చిరుఫలాలు, వైద్యవిధానం, ఇక్కడ తిరుగాడే నక్కబావలు, నాగుబాములు, బొంతగద్దెలు, మంత్రగబ్బలు, ఇత్యాది అసంఖ్య సామగ్రితో విశ్వంగారి కవితా విరూపాక్షుడు తాండవించినాడు. "భాష, అర్థము, భావము, ఛందస్సు అన్నియు ఆ తాండవమునకు ప్రక్కవాయిద్యాలు వాయించినవి." అని రాళ్ళపల్లి వారన్న మాటలో ఎట్టి అతిశయోక్తి లేదు.

విశ్వంగారు మద్రాసు యూనివర్శిటీలో "విద్వాన్" పరీక్ష ముగించిన తర్వాత అందరూ ఈయన్ని "విద్వాన్ విశ్వం" అని

పిలవడం మొదలుపెట్టిరి. అదే వారి సార్థక నామధేయ మయ్యేను. కాశీ హిందూ విశ్వవిద్యాలయములో సంస్కృత భాషా పరిశోధన సల్పుటకై చేరిరి కాని, విశేషంగా జబ్బు పడి నందువల్ల వదలివేసిరి. మరల ఆరోగ్యం చేకూరిన తరువాత కీ॥ శే॥ వేటూరి ప్రభాకరశాస్త్రి గారి సహాయముతో సంస్కృత భాషలో పరిశోధన గావించిరి. ఆ పరిశోధన ఫలితంగానే వీరు సంస్కృతములోని కాళిదాసు ప్రణీతమైన రఘువంశం, కుమార సంభవము మేఘసందేశములను; మాఘ, బాణభట్టు,భారవి, దండి కవుల శిశుపాలవథ, కాదంబరి, కిరాతార్జునీయము, దశకుమార చరిత్రలను తెనుగులో వచన కావ్యములుగా తెనిగించి ప్రచురించిరి. వీరనువదించిన కల్హణకవి "రాజతరంగణి" ప్రస్తుతము ఆంధ్రప్రభ ఆదివారపు అనుబంధములో ధారావాహికగా ప్రతివారం ప్రచురింపబడు చున్నది.

1938లో వీరు "నవ్య సాహిత్యమాల" స్థాపించి దాని ద్వారా పెక్కురచనలు వెలువరించిరి. అప్పుడే వీరి "విరికన్నె" అనబడు పద్యగద్య గ్రంథము ప్రకటింపబడినది. సాహిత్య పిపాసకులను, రచయితలను ప్రోత్సహించు నిమిత్తమై "నవ్య సాహిత్య పరిషత్తు" ఏర్పడగ ఆ పరిషత్తుకు వీరు కార్యనిర్వాహక సభ్యులైరి. 1945లో హైదరాబాదు నుండి వెలువడుతున్న "మీజాన్" తెలుగు దిన పత్రిక సంపాదక వర్గంలో వీర

ఒకరుగా పనిచేసిరి. "భారతి" మాసపత్రికలో గ్రంథసమీక్ష శీర్షికను కడుబాధ్యతతో నిర్వహించిరి.

1949లో శ్రీ విశ్వంగారు మద్రాసుకు వచ్చి, అక్కడి "అభ్యుదయ రచయితల సంఘము"నకు కొంతకాలము సంపాదకులుగా పనిచేసిరి. తరువాత 1952లో ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక మద్రాసు నుండి వెలువడుట ప్రారంభమైనది. అందులో చాలానాళ్లు వీరు సంపాదకులుగాపనిచేసి,మంచిపేరు తెచ్చుకొనిరి.

పెన్నేటిపాట తరువాత వీరి "ఒకనాడు" చెప్పుకోదగిన పద్యకావ్యము. ఇది ఆంధ్రప్రభ వారపత్రికలో ధారావాహికగా వెలువడినది. ఇది రాయలసీమలో జరిగిన ఒక వాస్తవ చారిత్రాత్మక సంఘటన. 1893 అక్టోబరు 4వ తారీఖున ఒక యూరోపియన్ సోల్జర్, హిందూ స్త్రీల మానమును రక్షించే ప్రయత్నములో పోరాడిన గూళిపాలెం హంపన్నను కాల్చి చంపినాడు. హంపన్న గుత్తిలోని రైలు గేటుకీపరు. ఆ హంపన్నచరిత్రకు కావ్యరూపమిచ్చి రాయలసీమ వాసుల కీర్తిని ఇనుమడింపజేసిన ధన్యులు విశ్వంగారు. వీరికి శ్రీ తిరుపతి తిరుమల వేంకటేశ్వరుడు ఆయురారోగ్య భాగ్యములనిచ్చి కాపాడుగాత.



# శ్రీ నూతలపాటి పేరరాజు

జననము :- 1896; నిర్యాణము :- 15-11-1968

తల్లి : శ్రీమతి సీతాంబ; తండ్రి : శ్రీ ఆదిరాజు

నివాసస్థానము :- ఉరవకొండ - అనంతపురం జిల్లా, ఆం.ప్ర.

గుంటూరు జిల్లా నూతలపాడు గ్రామములో పుట్టి పెరిగి, విద్యాబుద్ధులు నేర్చి "జగమెరిగిన బ్రాహ్మణునకు జందెమేల?" అన్నట్లు బహు గ్రంథకర్తలుగా వాసికెక్కి పెక్కేండ్లు అనంతపురం జిల్లాలో ఆంధ్రభాషోపాధ్యాయులుగా పనిచేసి, "విద్యార్ణవ" "సాహిత్య సరస్వతి" ఇత్యాది బిరుదములతో కవిగా, పండితునిగా వాసికెక్కిన శ్రీ నూతలపాటి పేరరాజు గారి నెఱుగని సాహితీ ప్రియులరుదు. విజయనగర సామ్రాజ్య చరిత్ర-తులసీ రామాయణం-ఆనంద రామాయణము వీరి భాషాసేవకు నిదర్శనములు. ఆనాటి స్కూలు ఫైనల్ విద్యార్థుల తెలుగు పాఠ్య పుస్తకములకు అరటి పండొలిచి చేతి కిచ్చినట్లుగా, సులభ పద్ధతిలో నోట్సులు తయారుచేసి ముద్రించి విద్యార్థి లోకమున కందించిన విద్యార్థి కల్పతరువులు వీరు.

తులసీరామాయణము, ఆనందరామాయణము, రామకథామృతము వీరి వచన రచనకు మచ్చుతునకలు. చక్కటి వచన రచన చేయగల సమర్థులు వీరు. వైదర్భీవిలాసము, శ్రీ సాయిబాబా చరిత్ర, శాంతి విజయము, తులసీదళము వీరి పద్య

రచనలలో మేల్బంతులు.

వీరి వైదర్భీవిలాసము ఒక చక్కటి ద్విపద కావ్యము. దీనిని కవిగారు 1918లో రచించి, 1928లో ముద్రించిరి. విదర్భ రాజతనయ, రుక్మిణీ పరిణయ గాథ యిందు వర్ణింపబడినది. రుక్మిణి తన మనోహరుడైన శ్రీకృష్ణునకు తన యభీష్టము తెలుపుచూ వ్రాసిన లేఖ చదువుడు.

మం.ద్వి॥ భువనైక సుందరా! పురుషాగ్ర గణ్య!
భవదీయ సుందర పదపద్మములకు
భక్తితో నొనరింతు వందన శతము
గొనుము దయాస్ఫూర్తి గోపాలబాల

— — — —

నిరతోదిత కరుణానిధి వీవటంచు
లావణ్య సర్వస్వ రమణుడవనుచు
నిన్నె వరింపంగ నెమ్మదిం దలచి,
వాంఛ బెంచితి నిన్నివత్సరంబులను;
నేడు వ్రాసితి లేఖ నీతియేలేక
మదవతియ లిఖించె మందాక్షమీగి
యని, నిరసింపక యరయుము కృష్ణ!

— — —

నీ పదాంబుజసేవ నేబాయగలనె?

మన్నించి కొనిపొమ్ము మానితాకార!
కల్యాణ పూర్వంబు గౌరీ నివేశ
మందు నేనుందు నమంద భక్తికడు
నార్యాసమర్చనా ధ్యాన లీననయి
విలసిల్లు తఱిగాంచి, విమత నికాయ
మాజి నిర్జించి, సమ్మానంబున, నను
గొనిపోవు ఖ్యాతిగై కొమ్ము మానాథ! - "రుక్మిణి"

"శ్రీ సాయిబాబా చరిత్ర" మను ఖండ కావ్యమందు శ్రీ షర్డీ సాయిబాబా పుట్టుక, మహిమలను సంక్షిప్తముగా కడు మనోహరముగా, రసవత్తరముగా వర్ణించిరి. పద్యములన్నియూ ఆణిముత్యములే. రచన అతిసరళము. ఇందు వారు "తోటకము" "సుగంధి" వృత్తములను గూడ వాడిరి. వీరి "సుగంధి" తీరును కొంత ఆఘ్రాణింతము.

కాంచి రంత గాంచనాబ్జ - క్రమ విస్తృతాక్షినిన్
మించి మందహాసమొల్కు - మేటి మోము వానినిన్
అంచితార్క ఘూరితేజు - హారి దివ్య దేహునిన్
ఎంచి చూడ వారి భాగ్య - మింతనంగ వచ్చునే.

"శ్రీకృష్ణ నిర్యాణము" వీరి అముద్రిత కృతి. శివవిద్యా శ్రీశైలప్రభ - ఆరాధన - పత్రికలకు వీరు సంపాదకులుగా పని చేసిరి. ఉరవకొండలో 30 సంవత్సరాలకాలం తెలుగు పండితులుగా

పనిచేసి, అక్కడే స్థిరపడిరి. కలకాలము నిలుచు కావ్యములే వీరి సంతానము. వీరికి అనంతపురం జిల్లాలో పెక్కుమంది శిష్యులున్నారు. వారందరూ ఉన్నత పదవుల నలంకరించి యున్నారు. వీరి శ్రీరామకథామృతమును ఉరవకొండ తా॥ పెద్ద కౌకుంట్ల గ్రామ వాస్తవ్యులు కీ॥ శే॥ పయ్యావుల కేశన్న గారి కుమారులు శ్రీ పయ్యావుల వేంకటనారాయణగారు తండ్రిగారి పేర ముద్రించి ధన్యులైరి. అనంతపురం జిల్లా సాహిత్యచరిత్రలో శ్రీ నూతలపాటి పేరరాజుగారి పేరు చిరస్థాయిగా నిలిచి కీర్తిని పొందినది.

---



## డాక్టర్ తూమాటి దొణప్ప

జననము :- 1-7-1926

తల్లి: శ్రీమతి తిమ్మక్క

తండ్రి: శ్రీ తూమాటి సంజీవప్ప

జన్మస్థలము: రాకెట్ల. ఉరవకొండ తా॥ అనంతపురం జిల్లా

ఉరవకొండ డిస్ట్రిక్టు బోర్డు హైస్కూలులో మూడవఫారం చదువుతున్న విద్యార్థులను వారి అభిమాన ఉపాధ్యాయులైన

శ్రీ నూతలపాటి పేరరాజుగారు ఒకసారి బాహ్యప్రపంచానికి విహారయాత్రగా పిలుచుకొని వెళ్లారు. వారు విద్యార్థులను సాహిత్యంలో బాగుగా ప్రోత్సహించేవారు. అప్పుడప్పుడు వారి మధ్య కవితాస్పర్ధలుకూడా నిర్వహించేవారు. ఆ విహారయాత్రలో ఆ పండితులవారు విద్యార్థులను ప్రకృతి సౌందరాన్ని, పుస్తకాలను, మానవ స్వభావస్వరూపాలను వర్ణించమనేవారు. ఉపాధ్యాయులిచ్చిన ప్రుత్సాహంతో విద్యార్థులు కొద్ది కొద్దిగా ప్రయత్నించి సత్ఫలితాలు పొందేవారు. ఒకసారి ఒక విద్యార్థిని సాయంసంధ్యను గూర్చి వర్ణించమన్నారు. అప్పుడా విద్యార్థి

సాంధ్యలలనా లలామంబు సంతసమున
కట్టుకొన్నట్టి హొంబట్టు పుట్టమనగ
సంజె కెంజాయ వెల్లెడ.....................ఇలా ఆశువుగా

చెప్పుకొంటూపోయాడు. ఆయనగారి ఆశ్చర్యానికి అంతులేదు. మరోసారి "పారిజాతాపహరణ" కావ్యంగూర్చి ఆశువుగా చెప్పమన్నారు. అప్పుడా విద్యార్థి తడుముకొనక,

పలుకు పలుకున తేనియ లొలుకునట్లు
అరణపుంగది ముక్కు తిమ్మన్నగారు
పారిజాతాపహరణమ్ము పాడినట్టి
కూరుచున్నారు ముత్యాల గొడుగునీడ.... అని వర్ణించాడు.

ఆ పండితులవారి ఆనందానికి అవధులులేవు. తన శిష్యులు

భవిష్యత్తులో మేటివారు కాగలరని ఆశించారు. వారిని ఆశీర్వదించారు. ఆ సుప్రసిద్ధ తెలుగు పండితుల ఆశీర్వచనములు పొందిన ఆ మేటి విద్యార్థి నేటి తెలుగు విద్యాలయపు తొలి వైస్ ఛాన్సలర్ డాక్టర్ తూమాటి దొణప్పగారు.

దొణప్పగారి చిన్ననాటి విద్యాభ్యాసము సొల్లాపురంలోని వారి పినతాత భీమప్పగారి వద్ద జరిగింది. భీమప్పగారు గొప్ప పౌరాణికులు. ఆయన సంస్కృతాంధ్రములందు మహా విద్వాంసులు. ఆయనవద్ద అమరం, శబ్దాలు, మేఘసందేశం, రఘువంశం, మున్నగు కావ్యాలను దొణప్ప పదేండ్లపాటు చదివారు. ఆ విద్యకూడా ఆయన వెంటే వుంటూ, ఆయన చెప్పిన పొలం పనులు చేస్తూ, "పనికి పని, పాఠానికి పాఠం" అన్నట్లుగా ఆడుతూ, పాడుతూ నేర్చుకొన్నారు. ఇలా ఆయన యోగవాశిష్ఠం. వివేకచూడామణి, భాగవతం, మున్నగు సంస్కృతాంధ్ర గ్రంథాలన్నీ ఆయన వద్దనే నేర్చుకొనాన్నరు. సాయంకాలం ఊరి రచ్చబండమీదో, ఇంటి అరుగుమీదో కూర్చుని భీమప్పగారు భారత, భాగవత, రామాయణాలను ప్రవచనం చేసేవారు. వాటిని శ్రద్ధగా వినడం, ఒకొక్కసారి తానుకూడ ప్రవచనం చేయడం, అర్థం చెప్పడం అలవాటు చేసుకొన్నారు దొణప్పగారు. ఇలా చిన్నతనంలోనే పురాణాలపై అతనికి మక్కువ జనించింది.

ఈ విద్యలోపడిన దొణప్పగారికి పదేండ్లవరకు ఎ. బి.

సి. డిలు కూడా రాలేదు. తరువాత ఆయన వజ్రకరూరులోని తన మేనమామ శ్రీ బొబ్బూరి చిన్నతిమ్మప్పగారి యింట్లో వుంటూ ఆంగ్లం నేర్చుకొన్నారు. I, II ఫారాలు అక్కడే ముగించి, IIIడవ ఫారం చదువు ఉరవకొండలో ప్రారంభించారు.

చిన్ననాటి నుండి నాటకాలలో అభినయించడం ఆయన అభిరుచి. చిన్ననాడే మోహినీ రుక్మాంగదలో రుక్మాంగదుడు, కృష్ణతులాభారంలో శ్రీకృష్ణుడు, సాయిలీలలో సాయిబాబా పాత్రలను నిర్వహించి మెప్పుపొందారు. ఇన్ని అభిరుచులున్నా ఆయన చదువులో మాత్రం అందరి కంటే ముందే. 1953లో ఆంధ్రా యూనివర్శిటి నుండి బి.ఎ. ఫస్ట్‌క్లాస్, ఫస్ట్ ర్యాంకులో ఉత్తీర్ణులయ్యారు. తదుపరి 1954లో అదే యూనివర్శిటి నుండి యం.ఎ. ప్రథములుగా వుత్తీర్ణులయ్యారు. 1965లో పి. హెచ్. డి. 1982లో డిలిట్ పొందారు. 26 ఏండ్లు ఆంధ్ర మరియు నాగార్జున విశ్వవిద్యాలయం రిజిస్ట్రారుగాను, అంతర్జాతీయ తెలుగు సంస్థ డైరెక్టరుగాను ఉన్నారు. ప్రస్తుతము తెలుగు విశ్వవిద్యాలయం తొలి వైస్ ఛాన్సలర్‌గా నియమింపబడ్డారు.

శ్రీ దోణప్పగారు తమ సాహిత్య కృషిని పూర్తిగా పరిశోధన కార్యక్రమాలకే వినియోగించిరి. వీరు 1969లో "ఆంధ్రసంస్థానములు-సాహిత్యసేవ" అను పరిశోధనా గ్రంథాన్ని ప్రచురించిరి. అది సాహిత్య అకాడమీ అవార్డు నందుకొన్నది.

భాషా చారిత్ర వ్యాసావళి, తెలుగులో క్రొత్త వెలుగులు, ఎని మిది పరిశోధన వ్యాసాల సంపుటి "జానపద కళాసంపద", తెలుగు హరికథా సర్వస్వం (సాహిత్య అకాడమీ అవార్డును 1975-76లో అందుకొన్న పరిశోధన గ్రంథము) వీరి ముద్రిత కృతులు. "తెలుగులో చేరిన ఇండో-ఆర్యన్ పదాలు - దక్షిణ భారతదేశంలో తోలుబొమ్మలాట - మన కళాప్రపూర్ణుల కవితా రేఖలు (కవితలు, జీవిత సంగ్రహాలతోబాటు) ఆకాశవాణి భాషి ణాలు - తెలుగు వ్యాకరణ వ్యాసాలు, ఇవి వీరి అముద్రిత కృతులు. ఇవియేగాక వీరి మరింకెన్నో కవితలు, వ్యాసాలు, కథలు, ఏకాంకికలు, వివిధ పత్రికలలో ప్రచురింపబడినవి.

ఆంధ్ర, ఆంగ్ల, కన్నడ, ప్రాకృత, సంస్కృత భాషలు వీరికి బాగుగా తెలియును. జానపద సాహిత్యము, మాండ లికములు, తెలుగు వ్యాకరణము, భాషాశాస్త్రము, శాసన పరి శోధనములు వీరి అభిమాన విషయాలు. ఇంతటి యోగ్యత గలిగిన విద్యావంతునకు అర్హమైన పదవి లభించినందుకు ఆంధ్రులమైన మనం గర్వింప వలసినదే. "మణినా వలయం, వలయేన మణిః మణినా వలయేన విభాతికరః అన్నట్లు వైస్ ఛాన్సలర్ పదవితో దొణప్ప, దొణప్పవల్ల వైస్ ఛాన్సలర్ పదవి, ఆ రెండింటితో తెలుగు విశ్వవిద్యాలయం శోభిస్తున్నవి" అని శ్రీ తిరుమల రామచంద్రగారు ఆంధ్రపత్రికలో వ్రాయడం

అతిశయోక్తి కాదు. ఆ భాగ్యము సంపూర్ణముగా రాయలసీమ వారిది కావడం మరింత గర్వించదగిన విషయము. 1986 జూలై ఒకటవ తేదీన వీరు షష్ఠి పూర్తిని జరుపుకొంటున్న సందర్భములో యివే మా హృదయపూర్వక అభివందన శతంబులు.

శ్రీ దొణప్పగారు రెండవ షష్టిపూర్తి మహోత్సవకాలం వరకు ఆయురారోగ్యభాగ్యములతో జీవించి మరింత సాహిత్య కృషి గావించగలరని కాంక్షించుచున్నవారము.

---



## డాక్టర్ అంతటి నరసింహం

జననము :- 1925

తల్లి :
శ్రీమతి అంతటి సుబ్బమ్మ

తండ్రి :
శ్రీ అంతటి చెంచలయ్య

జన్మస్థలము :
వెంకటరాజుపల్లి.
రాజంపేట తా॥ కడప జిల్లా

ఆదర్శాలు వల్లించడం అందరికీ తెలుసు. కాని ఆచరణలో వుంచడం మాత్రం అందరికీ చేతకాని పని. తమ రచనలద్వారా

రచయితలు ఆదర్శభావాలను, సంఘ సంస్కరణలను, వర్ణాంతర వివాహాలను, అస్పృశ్యతా నివారణ విధానాలను పాఠకులకు కథలుగా, నవలలుగా వ్రాసి అందివ్వవచ్చు. సన్మానసభల్లో శ్రోతల కరతాళధ్వనుల మధ్య వక్తలు ఆదర్శాలను ఉపన్యసించవచ్చు. కాని తొలుత తానాదర్శవంతుడై వుండాలనుకొనే రచయితలు, వక్తలు చాల అరుదు. వారాదర్శవంతులు కానప్పుడు వారి నీతిబోధకా లెవరికి అవసరమవుతాయి? తెలుగులో ఎందరో రచయితలు తమ రచనలలో సంఘ సంస్కరణ విషయాలను చొప్పించారు. ఆ రచనలు సాహిత్య చరిత్రలో ఖ్యాతి పొందాయి కూడ. ఆ రచనలు చదివి కొందరిలో మార్పురావడం కూడ జరిగింది. కానీ ఆ రచయితమాత్రం ఆ భావాలను కాసింత కూడ ఆచరణలో వుంచడు. అప్పుడవి శుష్కరచనలుగానే వ్యవహరించవలసి వుంటుంది.

భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించి 39 ఏండ్లు గడిచింది. విద్యాధికుల సంఖ్య పెరిగింది. నాగరికత బాగా ముదిరింది. అంతేకాని మానవత్వం ఇంకా పెంపొందలేదు. అందుకే మన జాతిలో నేటికి అస్పృశ్యత అలాగే వుంది. సాంఘిక అసమానత్వం అట్లాగే వుంది. అందుకే ఒక రచయిత తాను వ్రాసిన ఆదర్శాలను తొలుత తాను ఆచరణలో వుంచుతూ యిలా అన్నాడు. "నా నవలలను చదివి పాఠకులు మెచ్చుకుంటే

నాకంత ఉత్సాహం వుండదు. దానిలో చెప్పినట్లు ఆచరిస్తే అధి కానందం కలుగుతుంది. దీనివల్ల వారికి, దేశానికి, అసలు మానవజాతికీ అభ్యుదయం కలుగుతుంది" అని. అలాంటి అభ్యుదయవాది. ఆ ఆదర్శరచయిత శ్రీ అంతటి నరసింహం గారొక్కరేనని ఘంటాపథంగా చెప్పవచ్చు.

శ్రీ అంతటి నరసింహంగారు కులవ్యవస్థను రూపు మాపుతూ, స్త్రీ విద్యను ప్రోత్సహిస్తూ, వరకట్నం నిషేధిస్తూ, కులాంతర వివాహంగా ఓ చదువుకొన్న అమ్మాయిని, కట్నం లేకుండా పరిణయమాడారు. కాలేజిలో చదువుతున్నంత కాలము కాఫి, టీ, సిగరేట్ ముట్టక ఆదర్శవంతంగా జీవించారు. ఆదర్శ రచయితగా వాసికెక్కారు.

శ్రీ అంతటి వారు 1939-40లో మిడిలుస్కూలు విద్య ముగించి 1943లో యస్. యస్. యల్. సి. ముగించారు. అనంత పురం కాలేజీలో 1945లో ఇంటర్మీడియట్ ముగించి, 1949లో వాల్తేరు ఆంధ్ర విశ్వవిద్యాలయములో బి. ఏ. ఆనర్సు ముగించి పిదప 1974లో శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటి నుండి "ప్రబం ధాలలో ప్రకృతివర్ణన" అనే పరిశోధనా గ్రంథము వ్రాసి డాక్ట రేట్ పొందారు. 1946 నుండి 1976 మధ్య అనేక ప్రభుత్వ కళాశాలలలో ఆంధ్రోపన్యాసకులుగా పనిచేశారు. తరువాత 1976 ఫిబ్రవరి నుండి కొంతకాలము ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృ

తిక వ్యవహారాల శాఖకు ప్రత్యేకాధికారిగా నియమింపబడ్డారు.

శ్రీ అంతటి నరసింహంగారి మనోగత భావాలను మనం వారి రచనల వల్లనే తెలుసుకోవచ్చు. వారు సమాజంలో సమానత్వం కోరారు. అస్పృశ్యత అణగారి పోవాలంటే కుల వ్యత్యాసాలను కూల్చి, కులాంతర వివాహాలు జరపాలంటారు. "సమాజంలోని ఉచ్చనీచతలకు, కలిమిలేములకు, అజ్ఞాన అస్పృశ్యతలకు, వర్ణధర్మమే మూలకారణం. అట్లే మన సాహిత్యాన్ని సంస్కరించాలి" అని అంతటివారు తమ అభిప్రాయాలను వెల్లడిచేశారు.

వీరు గేయకావ్యాలు, సాంఘిక నవలలు, చారిత్రాత్మిక నవలలు, నాటకాలు మరెన్నో రచించారు. వీరి రచన లన్నింటిలోను వీరి అభిమాన విషయాలను గూర్చే చర్చించారు. ఆదర్శం - భావం - స్వగతం-ప్రేమభిక్ష - శోభాదేవి - శంపాలత వీరి సాంఘిక నవలలు. వీరి నవలలు సంఘంలో కొంత సంచలనాన్ని సృష్టించాయి. వీరి "భావం" నవలలో "సెక్సు" అధికంగా వుందని పాఠకులు అభిప్రాయపడినా, అది వట్టి భ్రమేనని, అది వారి భావంమీద ఆధారపడి వుంటుందని నిరూపించారు. పెద్ద-చిన్న, కులం-మతం, దేవుడున్నాడు - లేడు ఇవన్నీ భావంపైనే ఆధారపడి వుంటాయన్నది రచయిత భావన.

వీరి ఆదర్శం నవలలో అస్పృశ్యతానివారణ ముఖ్యాంశంగా

చెప్పబడింది. కులమత భేదాలవల్ల వివాహం ఆగిపోయి, అవివాహితగా నిలచిపోయిన లేడీ లెక్చరర్ సానుభూతిమయ గాథ "లేడీ లెక్చరర్ స్వగతం" నవలలో చెప్పబడింది. "సహజీవనం" అస్పృశ్యతా నాటిక. 1956లో అనంతపురం జిల్లా కలెక్టరుగారు జరిపిన పోటీలలో దీనికి బహుమతి వచ్చింది. సఘర సత్వం-మానవత్వం-పరిష్కారం వీరి మరికొన్ని సాంఘిక నాటకాలు. పరిష్కారం నాటకంలో మరో అంతర్నాటకం ఉండడం ఒక విశేషము. రామరాయలు-చారిత్రాత్మిక నవల. ఇందు అళియ రామరాయలు కులాంతర వివాహం చేసుకొని ఆనాటికే ఆదర్శవంతుడయ్యాడని, సంఘసంస్కరణ ఆనాటినుండే అమలులోకి వచ్చిందని చెప్పబడిన నవల యిది. "భువనవిజయం"-పఠనకు ప్రదర్శనకు యోగ్యమైన నాటిక.

ఇవియేకాక బాలసాహిత్యం వైపు కూడ తమ కలాన్ని నడిపించారు అంతటివారు. కోటవీరన్న సాహసం, ఉదయగిరి పోలన్న ధైర్యం, మంత్రాల రామన్న మొండితనం, కవిగారి బాల్యం వీరి బాలసాహిత్యపు నవలలు. చాలా కుతూహలం రేకెత్తించే విధంగా వ్రాయబడిన పిల్లల నవలలివి. ఇంకనూ వీరి వెన్నో అముద్రిత కృతులు ముద్రణ భాగ్యాన్ని పొందవలసి వున్నాయి.

శ్రీ అంతటి నరసింహంగారు విశాల హృదయులు.

పండితుల యందాదరాభిమానములు గలవారు. సమతావాదిగా మానవసేవ చేస్తున్నవారు. పరమేశ్వరుడు వీరికి ఆయురారోగ్య భాగ్యములనిచ్చి కాపాడుగాత!

---



## శ్రీ అవధాని రమేష్

జననము: 12-4-1921

తల్లి: శ్రీమతి సావిత్రమ్మ

తండ్రి: వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి

జన్మస్థలం: ఔరు అగ్రహారం. కర్నూలు జిల్లా

అనంతపురంలో ఒకసారి జిల్లా రచయితల సంఘం మహాసభలు వేడుగ్గా జరిగాయి. ఆ కార్యక్రమంలో ఒకనాడు బాల సాహిత్యానికి సంబంధించిన ఒక కథల సంపుటిని ఆవిష్కరించడం జరిగింది. ఆ సభలో ఆ రచయిత "మన జిల్లాలో బాల సాహిత్యం వ్రాసిన రచయితలు లేరు." అని గట్టిగా చెప్పడం, ఆ సభాధ్యక్షులవారు వెంటనేలేచి "అయ్యా! మీకు తెలియదేమో! ఈ సభకు ఉపన్యాసకులుగా ఆహ్వానింపబడిన అవధాని రమేష్

గారు మనజిల్లాలో విద్యాశాఖాధికారులుగా పనిచేసినవారు. బాల సాహిత్య రచయితలు. పెక్కు పిల్లల కథలు, పుస్తకాలు వ్రాసినవారు. రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాల నుండి 1965, 67, 69 సం॥లు వరుసగా బాలసాహిత్య బహుమతులను గెల్చుకొని, సన్మానింపబడినవారు" అని శ్రీ అవధాని రమేష్‌గారిని గూర్చి శ్రోతలకు చెప్పగానే, ఆ రచయితతోబాటు పెక్కురు తమకొక కొత్త విషయం తెలిసివచ్చినట్లు చకితులయ్యారు. అంతవరకు శ్రీ అవధాని రమేష్‌గారు వారందరికీ జిల్లా విద్యాశాఖాధికారిగానే పరిచయం.

శ్రీ అవధాని రమేష్ గారు అనంతపురం జిల్లాలో చాల ఏండ్లు జిల్లా విద్యాశాఖాధికారిగా పనిచేశారు. వీరు ఈ జిల్లా లోని చాలామంది ఉపాధ్యాయ వర్గానికి గురుదేవులు. చక్కటి బోధకులు, మంచి రచయితలు. తెలుగు, ఇంగ్లీషు, హిందీ, సంస్కృత భాషలలో గొప్పగా కృషిచేసిన విద్యావంతులు. మంచి వక్తలు. అభ్యుదయ భావాలుకలిగిన అభ్యుదయ కవి. సంస్కృత ములో కొన్ని వందల శ్లోకాలను కంఠస్థముచేసి, వాటిని తమ ఉపన్యాసములలో సందర్భానుసారముగా వల్లిస్తూ, అర్థము విశదీకరిస్తూ శ్రోతల నానందింప చేయుట వీరి ఉపన్యాసములోని ప్రత్యేకత.

శ్రీ రమేష్‌గారి ప్రాథమికవిద్య స్వగ్రామంలో జరిగింది.

6వ తరగతి నుండి యస్. యస్. యల్. సి. వరకు తాడిపత్రి పురపాలకోన్నత పాఠశాలలో విద్య నభ్యసించిరి. అటుతరువాత అనంతపురం ఆర్ట్సు కాలేజిలో ఇంటర్, బి. ఏ., పరీక్షలలో కృతార్థులై కాశీ విశ్వవిద్యాలయంలో ఎం. ఏ. పరీక్ష నెగ్గిరి. "ఇంగ్లీషు మెథడ్సు"లో ప్రత్యేక శిక్షణ పొందిరి.

వీరు మంచి రచయితలు. దరిదాపు 60 పుస్తకములు రచించిరి. బాలసాహిత్యంపై ఎక్కువగా కృషిచేసిరి. బాలల కనువగు పుస్తకములు వ్రాసిరి. వాటిలో ముఖ్యమైనవి లాల్ బహదూర్ శాస్త్రి, బాలగంగాధరతిలక్, తృణకంకణము, వీర పూజ, మూడు మంచికథలు, ప్రతీకారము (చిన్నకథలు) కానుల పేరు (పిల్లలకథల సంపుటి) అజ్ఞాతవీరులు, ఇందిరాభారతం, వీరు ఇతర రాష్ట్రపు విద్యార్థులకొరకు ఆంగ్లములో వ్రాసిన "ఉపవాచకములు" మిక్కిలి వ్యాప్తిలోనికి వచ్చినవి. వీరి ఇందిరాభారతం ఒక ఉద్గ్రంథము. భారతరత్న శ్రీమతి ఇందిరా గాంధి జీవిత చరిత్రను, ముఖ్య ఘట్టములను, ఆమె పాలనా కాలములో సాధించిన ఘన విజయాలను రచయిత చక్కగా, విపులంగా, ఫోటోలతో 250 పేజీల డెమ్మీసైజులో ప్రచురించారు. ఈ పుస్తకాన్ని ఒక జీవితచరిత్ర గ్రంథంగా కాకుండా "ఫ్లాష్‌బ్యాక్ టెక్నిక్" ని ఉపయోగించి వ్రాయడంతో చదువరులను విశేషంగా ఆకర్షిస్తుంది. రచయిత బహు శ్రమలకోర్చి

అనేక విషయములను ఈ గ్రంథములో చొప్పించి గణనీయ మైన కృషి చేసిరి.

భారత స్వాతంత్ర్య పోరాటములో అవధానిగారు కూడ పాల్గొని కారాగారక్లేశము ననుభవించిన అజ్ఞాత యువకవీరులలో ఒకరు. అందుకే వారు మాతృదేశ దాస్యవిముక్తికై పోరాడిన అజ్ఞాత వీరులకు శ్రద్ధాంజలి ఘటిస్తూ "అజ్ఞాతవీరులు" అను పొత్తమును వారికి అంకితమిచ్చిరి. ఈ పుస్తకమునందు వీరు వ్రాసిన "పూర్వచరిత్ర - స్వాతంత్ర్యసౌధపు పునాదులు" అను ముందు మాట చదివినప్పుడు రచయితగారికి గల బహు గ్రంథ పరిచయమును గూర్చి మనకు తెలియనగును. ఇందు బలవంత రావుఫాడ్కే, హరిదయాల్, జితేంద్రనాథ్‌లహరీ, శ్రీమతి బీణాదాస్, నారాయణ (హుబ్లి)ల చరిత్రలు చేర్చబడినవి.

ఈ అజ్ఞాతవీరుల అమర చరిత్రలను వ్రాయదలచి, కవి గారు భారతజనని ఆశీర్వాదములు కోరుతూ ఇట్లు వ్రాసిరి.

"ఇతిహాసపు చీకటికోణం
అట్టడుగున పడి కాన్పించని
కథలన్నీ కావాలిప్పుడు
దాచేస్తే దాగనిసత్యం

భారతవీరుల దివ్యగాథలు
స్మరిస్తే హృదయవిదారం

మఱపిస్తే మఱువనిదృశ్యం
భారతీయ యితిహాసం."

మాతృదేశంపై అనన్య భక్తిప్రపత్తులను తమ రచనల ద్వారా వెల్లడించిన దేశాభిమానులు శ్రీ రమేష్‌గారు. ఎన్నో ఏండ్లు జిల్లా విద్యాశాఖాధికారిగా తమ కార్యనిర్వహణలో ఎల్లప్పుడు నిపుణులై వున్నను, సాహిత్యాభిమానులుగా ఎన్నో రచనలుచేసి, విప్లవరచయితల సంఘం, అభ్యుదయ కళాసమితి, రాయలకళాగోష్ఠి మొదలగు సంస్థలను స్థాపించిరి. "విశ్వప్రేమ" అను పత్రికను నడిపిరి. వీరి సతీమణి శ్రీమతి పద్మావతమ్మ కూడ జిల్లా విద్యాశాఖాధికారిణిగా పనిచేసిరి. ప్రస్తుతము వీరు అనంతపురం పట్టణములో స్వగృహమందు విశ్రాంతి తీసుకొం టున్నారు. వీరికి భగవంతుడు ఆయురారోగ్య భాగ్యములనిచ్చి కాపాడుగాత!

---

బాలకవి

## శ్రీ పాలుట్ల వెంకటనరసయ్య

జననము : 29-12-1911

తల్లి: శ్రీమతి సుందరమ్మ; తండ్రి: శ్రీ మార్తాండయ్య

జన్మస్థలం: రాజుపాలెం - ఎఱ్ఱగొండుపాలెం తా॥ - ప్రకాశం జిల్లా

శా॥ సాలంకారముగా సలక్షణముగా శబ్దార్థయుక్తంబుగా
సౌలభ్యంబగు శైలి, సత్కవులు మెచ్చన్। కందముల్‌నూరుని

ట్లాలోచించక, బాల్యకాలమున వ్రాయ। న్నేర్చితౌనౌ! భళీ!
పాలుట్లాన్వయవార్ధిపూర్ణకుముదాప్తా! నారసింహాగ్రణీ॥

అంటూ అవధాని శ్రీ ఉప్పల పిచ్చయ్యశాస్త్రిగారు, శ్రీ పాలుట్ల వెంకటనరసయ్యగారి "హైమవతీశ" శతకము పఠించి, వ్రాసిన ప్రశంసాపద్యమిది. చిన్నతనముననే కవిత్వము వ్రాయుట కలవాటుపడిన వెంకటనరసయ్య గారిని అందరూ "బాలకవి" యని పిలిచిరి. ఈ కవితాధోరణి యలవడుటకు ముఖ్యకారణము, వారు శ్రీ మద్దిరాల గోపన్నగారి గురుకుల వేద పాఠశాలలో శ్రీ రాళ్ళబండి నృసింహశాస్త్రుల వద్ద, "రఘు వంశము," "అప్పకవీయాది" గ్రంథములు చదువుటవలనను, వారి కులదైవము, శ్రీ త్రిపురాంతకేశ్వరస్వామి వారి అనుగ్రహము వల్లను కలిగినది. శ్రీ త్రిపురాంతకేశ్వరస్వామిని, వీరి కుటుంబీకులు కడు భక్తిశ్రద్ధలతో అహర్నిశలు కొలిచెడిభక్తాగ్ర గణ్యులు.

శ్రీ వెంకటనరసయ్య, చిన్నతనమునుండి దత్తుతండ్రి నరసయ్యగారి వద్దనే పెరిగి విద్యాబుద్ధులు నేర్చిరి. 5వ తరగతి వఱకు మాత్రమే పాఠశాల చదువు సాగినది. 11వ ఏటనే ఉపనయనము చేసికొని తండ్రిగారి వద్ద "మంత్రపాఠము" "ముహూర్త జాతక పాఠములు", వేద పాఠశాలలో "శాస్త్రము, ఛందస్సు" నేర్చి, కవిత్వము చెప్ప నారంభించిరి.

1931 సం॥ నుండి కొంతకాలము త్రిపురాంతకపు గ్రామ కరణముగాను, మునసబుగాను, పనిచేసిరి. "పరోపకారార్థ-మిదంశరీరం" అను ఆర్యోక్తి ననుసరించి వీరు తమ గ్రామములోని హైస్కూలు, ఆస్పత్రి, దేవళములకు విరివిగా విరాళముల నిచ్చిరి. కాశీ, రామేశ్వరాది తీర్థయాత్రలు చేసిరి. అన్నదానము లొనర్చి, వేదపండితులను, కవులను సన్మానించిరి. ఇన్ని పుణ్యకార్యములు చేసినను, వీరు చేసుకొన్న పూర్వజన్మ దుష్కర్మఫలమేమో గాని సంతానము దక్కలేదు. తుదకు కవిగారు తమ గ్రామం రాజుపాలెములోని, తమ కులదైవం శ్రీ త్రిపురాంతకేశ్వరస్వామి వారి యనుగ్రహముకోరి "హైమవతీశ శతకము"ను రచించి, ముద్రించి ఆ పొత్తములను, కాశీగంగ సమారాధన సందర్భమున బంధు మిత్రాదులకు పంచిపెట్టిరి. వీరి హైమవతీశ శతకములో ఆ త్రిపురాంతకు నిట్లు వేడిరి.

కం॥ చాలు సుపుత్రుండొక్కం
డేలా? బహుమంది సుతులు హీనమనస్కుల్
చాలడె శూరుండొక్కం
డాళంబున ధైర్యశాలి, హైమవతీశా!

కం॥ అనృతం బాడిన దోషం
బున, కెనయగు దోషమున్నె? భువి, నిది నిజమౌ
నని, మదిలోనమ్మి నరుం
డనయము, నిజ మాడవలయు; హైమవతీశా!

వాగ్దాన మొనర్చినచో దానిని తూ.చ. తప్పక ఆచరించెడి దీక్షా పరాయణులు, వెంకటనరసయ్యగారు. అనృతదోషమునకు కూడా వారు వెఱతురు. ఒకసారి అవధాని ఉప్పల పిచ్చయ్య శాస్త్రిగారిని, ఫలనా రోజున వచ్చి దర్శించెదనని చెప్పి, అనివార్యమైన కార్యమొక్కటి తటస్థించి చెప్పిన వ్యవధిలో వారిని కలియలేకపోయినందుకు చింతించి, అనృతదోష నివారణార్థము వారు ఆ రాత్రికి రాత్రే 25 మైళ్ళు నడిచి వెళ్ళి రాత్రి ఒంటి గంటకు వారిని దర్శించిరి. అప్పుడు శ్రీ పిచ్చయ్యశాస్త్రి గారు, ఆశ్చర్యపడి ఆశువుగా యిట్లు చెప్పి, ఆశీర్వదించిరి.

ఆ.వె. వనజ సంభవుండు - యినుపకాళ్ళను, రాతి
నోరు బెట్టి, నీ శరీరసృష్టి
జేసె; లేకయున్న - చిత్రంబుగా నిట్లు
నడువ, నుడువనగునె? నారసింహా!

అట్టి పెద్దల ఆశీర్వచన ఫలితముగా, వీరు శ్రీ త్రిపురాంతకేశ్వర మాహాత్మ్యము రచించి, ప్రచురించిరి. ఉగ్రనరసింహాస్వామిదండకము, మార్కాపురం చెన్నకేశవచరిత్ర, తిరుమలనాథస్వామి చరిత్ర, పాలంక వీరభద్రుని చరిత్ర, పాలుట్లవారి వంశచరిత్ర, మార్కాపురం తాలూకా కవులచరిత్ర వీరి అముద్రిత కృతులు. శంకరుడు తమ కిచ్చినంతలో లేదనక కవి పండితుల కార్థిక సహాయం గావిస్తూ కవిపోషకులని కీర్తి పొందిరి. వీరికి ఆ త్రిపురాంతకేశ్వరుడు ఆయురారోగ్య భాగ్యములిచ్చి కాపాడుగాత!



## శ్రీ గరుడంపల్లి రోషన్

జననము :- 11-9-1942

తల్లి: శ్రీమతి మెహబూబీ

తండ్రి : శ్రీ ముష్కిన్‌వలీ

జన్మస్థలము : గరుడంపల్లి.

ధర్మవరం తా॥

అనంతపురం జిల్లా

భారతరత్న, శాంతిదూత, భారత ప్రియతమ నాయకుడు శ్రీ చాచా నెహ్రూ, దివంగతులైనప్పుడు యావద్భారత దేశమే శోకసముద్రములో మునిగింది. అనంతపురంలో, ఆ ప్రియతమ నాయకునకు శ్రద్ధాంజలి ఘటించడానికి ఒక సంతాపసభ జరిగింది. ఆ సభకు ప్రముఖులందరూ హాజరయ్యారు. శ్రీ కల్లూరు సుబ్బరావుగారు ఆ సభకధ్యక్షులు. పెక్కుమంది కవిపండితులు తమ ప్రగాఢ సంతాపమును వెల్లడించి జోహార్లు అర్పించిరి. వీరందరిలోను ఒక యువకవి వ్రాసిన "పంచాశ్రువులు" అందరి మన్ననల నందుటేగాక కల్లూరు సుబ్బరావుగారి మెప్పును ఆశీస్సులను పొందడం జరిగింది. ఆ కవి వ్రాసిన పద్యమిది.

ఉ॥ నెత్తురు లింకినట్టి ధరణీస్థలి, నీతియు దేశభక్తియున్

గిత్తలగట్టి ధర్మమును కేల హలంబుగ బట్టి, సత్యపున్

సత్తువబెట్టి, సాత్త్వికపు సస్యములన్ మొలిపించి, శాంతి సం
పత్తిని పెంచినట్టి "కృషిపండితు"డా జవహారు డుర్వరన్.

ఈ పద్యమువిన్న ప్రతిఒక్కరు, ఆనాడె ఈ యువకుడు మంచి కృషి గావించిన చక్కటి రచనలు చేయగలడని తలచిరి. ఆ కృషిని విడువక ఆ యువకుడు తెలుగు సాహిత్య నందనోద్యానవనంలో, సుగంధ కవితా పుష్పములను పూయించినాడు. మహమ్మదీయ కుటుంబమున పుట్టిన ఆ కవిపేరు గరుడంపల్లి రోషన్.

శ్రీ రోషన్ చిన్నతనంనుండి భారతీయ జాతి సమైక్యతా భావమును కలిగిన అభ్యుదయవాది. వీరి తండ్రి ముష్కిన్‌వలీ ఉపాధ్యాయ వృత్తిని నిర్వర్తిస్తూ, కవిత్వాన్ని కైవశం చేసుకొని, ఎన్నో ఖండికలు "నానార్థపద్యరత్నాకరము" అను వేయి కందములుగల గ్రంథము రచించినవారు. ఈతని పెద్దతల్లి యం. రాబీయాబీ (చిట్యేడు) అనంతపురం డిస్ట్రిక్టు బోర్డు మెంబరుగా పేరు గడించి, "క్విట్ ఇండియా" ఉద్యమంలో కారాగార శిక్ష అనుభవించిన తొలి మహమ్మదీయ వనిత. శ్రీ పొట్టి శ్రీరాములుగారు ఈమెను, "మహమ్మదీయ ఆదర్శమహిళ" గా ప్రశంసించిరి.

ఈ కవికి కులమతముల యెడ సంకుచిత భావములేదు. పుట్టింది మహమ్మదీయ మతంలోనైనా తొలుత వినాయకునికి

సలాములుచేసి కవిత ప్రారంభించును. తిరుపతి వేంకటేశ్వరుని తన యిష్టదైవంగా భావించును. అల్లాను ఆరాధించును. అందుకే ఆయనంటాడు "నాది భారతజాతి" అని. "నేను-నా దేశం" అనే ఖండికలో యిట్లా చెప్పుకొంటాడు.

తే॥ సంకుచిత వర్ణభేదముల్ సమయజేసి
పరగు సువిశాల దీర్ఘ దృక్పథము నాది
మతము, కులమను, నంధతమస్సు బాసి
ప్రభలు జిందెడి దృఢ మనోరథము నాది.

శ్రీ రోషన్ కవిత్వము, శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి కవిత్వాన్ని జ్ఞప్తికి తెస్తుంది. ఈతని కవిత్వం అతి మృదు మధురంగా, సరళంగా, భావయుక్తంగా, రమ్యతగా ఉషఃకాలంలో వీచే మలయమారుతంగా సాగిపోతుంది. ఇతనిది జీవమున్న కవిత్వము. సహజ సుందరంగా పూచి, మొగ్గతొడిగి, వికసించి, గుబాళించే గులాబీ సౌబగులావుంటుంది వీరి రచన. "రాగ సుందరి" ఖండికలో వీరి సుందరమైన రచన యిలా సాగింది.

ఉ॥ కొమ్మలమాటులో, కొదమకోయిల, కమ్మగ పాడసాగె రా
రమ్మసఖీ! సుఖింతమనురాగ సుధాంబుధిలోనదేలి, ప్రా
యమ్మికరాదు; రేపనెడి యాసలు జూపగనేల నింక? నీ
కమ్మనిమోవి పానమును, కాన్కగ నీయవె! రాగసుందరీ!

వీరు వ్రాసినవన్నీ ఖండికలే. అన్నీ అముద్రితాలే. పుస్తకరూపమున కింకా ఎక్కలేదు. సాహితీ మిత్రుల ప్రోద్బలముతో వీరు "చంద్రవదన - మోహియార్" అను "ప్రేమైక్య జీవుల" చారిత్రాత్మక కథావస్తువును గైకొని కావ్యముగా వ్రాసిరి. ఇందలి పద్యములు రసగుళికలు. ఆ కావ్యము వెలుగు జూచెడి భాగ్యము కవిగారికి భగవంతుడు కలిగించుగాత!

"సత్యభామ సాంత్వనము" - "మణిమేఖల" - "భావ తరంగాలు" మరికొన్ని నాటికలు - పాటలు-పద్యాలు, వీరి అముద్రిత రచనలు. వృత్తిరీత్యా ఉపాధ్యాయులగుటచే, పుస్తకములు స్వంతముగా ముద్రించుకొను ఆర్థికస్తోమత వారికి లేదు. చిన్నతనమునుండి సంగీతము-సాహిత్యములమీద అభిమానం మెండు. తాను వ్రాసిన పాటలు, పద్యాలకు చక్కటి బాణీలను రాగాలను కూర్చి పాడగల నేర్పరి. కొందరి తేనెమాటలు నమ్మి, సినిమా రచయితగా పైకి రావాలని ఉబలాటపడి, అక్కడి వారి స్వార్థ బుద్ధులను పసిగట్టి, "వారు ఉన్నత స్థితికి రావడానికి మనల్ని నిచ్చెనలుగా ఉపయోగించుకొంటారే తప్ప మనల్ని పైకి రానీరు" అని తెలుసుకొన్న కవి రోషన్. ఈతనికి భగవంతుడు భవిష్యత్తులో, ఆయురారోగ్య భాగ్యములనిచ్చి కాపాడుగాత!



# శ్రీ బత్తలపల్లి నరసింగరావు

జననము : 22-8-1901 —— నిర్యాణము : తేది తెలియదు

తల్లి: శ్రీమతి నరసమ్మ —— తండ్రి : శ్రీ సుబ్బరామయ్య

జన్మస్థలము : మద్దిమడుగు - కదిరి తా॥ - అనంతపురం జిల్లా

శ్రీ బత్తలపల్లి నరసింగరావుగారు 1944 నుండి 1958 వరకు అనంతపురం మునిసిపల్ హైస్కూలులో గ్రేడు-I తెలుగు పండితులుగా పనిచేసి, రిటైరయిన తదుపరి పోలీసు ట్రయినింగు కాలేజీలో లెక్చరరుగా చేరి, కొన్నాళ్ళు పనిచేయడంతో వీరి పేరు అనంతపురం జిల్లా వారికి బాగుగా తెలియును. వీరు భక్తకల్పద్రుమ శతకమును 1931లోను, కులలక్ష్మి 1933 లోను, 1948లో జవహర్ ఇందిరలేఖలు (అనువాదము)1963లో నీతిగాథలు ముద్రించిరి. వీరి భక్తకల్పద్రుమ శతకము కదిరి శ్రీ లక్ష్మీనరసింహస్వామియొక్క స్తోత్రములు. అందలి పద్య మొకటి చూతము.

శా॥ శ్రీరమ్యంబగు రత్నపీఠమున, నాసీనుండవై పార్శ్వమం
దారామామణి సేవజేయగను, బ్రహ్లాదుండు సద్భక్తితో
నారాధింప గృహాంతరంగమున, నిష్టార్థంబులన్ గూర్చు లో
కారాధ్యా! ననుగావు ఖాద్రి నరసింహా! భక్త కల్పద్రుమా!

వీరి అముద్రితకృతులు పెక్కు కలవు. వాటిలో "చంద్ర వదన మోహియార్" - 3 ఆశ్వాసముల కావ్యము. మత సామ

రస్యమును ప్రబోధించు ప్రేమజీవుల గాథ. దీనిని కవిగారు శ్రీ గాంధీ మహాత్మునికి అంకిత మిచ్చిరి. "అభినవ - వేమన శతకము", "రామస్తోత్ర రత్నాకరము", "ఖాద్రి లక్ష్మీ నృసింహ స్వామి చరిత్ర" ఇవి కూడ అముద్రితములే. అభినవ వేమన శతకములో 300 పద్యములు కలవు. అందలి ఒక పద్యము.

వాణి యజునిరాణి - వాక్కున నెలకొని
వీణమీటి సెగడ - వివిధగతుల
ఆట వెలదులెల్ల - నవె యాడి పాడెరా
విశ్వదాభిరామ - విను నృసింహ!

శ్రీ నరసింగరావు సంఘసేవా పరాయణులు. వీరు ఐక్య భారత సేవాసంఘమును స్థాపించిరి. గాంధి ఆయుర్వేద ఆస్పత్రిని నెలకొల్పి ఉచిత వైద్యము చేయుచుండిరి. బొంబాయిలోని "సంస్కృత విశ్వపరిషత్తు"కు సెక్రెటరీగా పనిచేసిరి. అనంతపురం కొత్తూరులోని మూడవ రోడ్డులో చాలకాలము నివసించి తుదకు ఖాద్రి లక్ష్మీనరసింహస్వామి కృపకు పాత్రులై దివి చేరిరి.



## శ్రీ టి. శివశంకరం పిళ్లై

శ్రీ టి. శివశంకరంపిళ్లైగారు అనంతపురం జిల్లా పెనుకొండ నివాసి. న్యాయవాది, మంచివక్త, మంచి రచయిత. అనేక సంవత్సరాలు పెనుకొండ తాలూకా బోర్డు ప్రెసిడెంటుగా పని చేసిరి.

వీరు వ్రాసినవి : 1) రామరాయలచరిత్ర, 2) వేంకటపతిరాయలచరిత్ర, 3) రాజత్వపౌరత్వము, 4) ఆంగ్లదేశాటన చరిత్ర, 5) భగవద్గీత, 6) స్థానికకూటములు, 7) దేశమాతా స్త్రవము, 8) ఉల్‌నత్తుఖాజాకంగళ్. (తమిళ గ్రంథము)

" దేశమాతాస్త్రవము " (National Anthem) ఒక దేశీయగీతము. స్వరసాహిత్యములతో ప్రచురింపబడినది. ఇట్టి గీతము దేశమున కవసరమని ఎంచి శ్రీ టి. శివశంకరపిళ్లైగారు 1883 నాటికే ఈ గీతమును రచించి, దానిని 1908 సంవత్సరంలో మదరాసు కాంగ్రెస్సు సభలకు వెళ్ళినప్పుడు ఆంధ్ర నాటక పితామహులగు శ్రీమాన్ ధర్మవరం రామకృష్ణమాచార్యులవారికి పాడి వినిపించిరి. ఆ పాట అల్లుటకు వీరి కాప్తమిత్రులైన సంగీత విద్వాన్ " చోళేమరి నరసింహాచార్లు ", చిరకాలము పెనుకొండలో ఉపాధ్యాయులుగా పనిచేసిన "శ్రీ కురూత్తాళ్వారు అయ్యంగార్లు", బెంగళూరు "చక్రవర్తి వేంకటవరద అయ్యంగార్లు" తోడ్పడిరి. ఆంధ్రభాషయందు దేశీయ గీతమంత వరకు

లేదను కొఱతను పిళ్లేగారు తీర్చిరి. వీరీ గీతమును వ్రాయుటలో గల ఆశయము నిట్లు వ్రాసుకొనిరి.

" జాతీయైక్యతకు ఆంధ్రలోకమున కిట్టి గీత మొకటి ఇప్పటి పరిస్థితులందు ఆవశ్యకమనియు, యిట్టి గీతము, నెల్లరూ పాడ నేర్వవలెనన్న స్వర సాహిత్యములు, సులభములై యుండుట అవసరము. అందలి భావములు సహితము లలిత ములై యున్నగాని ప్రయోజనముండదు. అందుకే ఈ గీతము నాంధ్రలోకమునకు సమర్పించితిని."

వీరి రామరాయలచరిత్ర, వేంకటపతి రాయలచరిత్ర, ప్రసిద్ధములు. అవి ప్రస్తుతము అలభ్యములు. ఈ రెండు పుస్తకములు చరిత్రకారుల కెంతగానో నేటికి ఉపయోగపడు చున్నవి. వీరి కృషి ఆచంద్ర తారార్కముగా నిలిచినది.

---

## శ్రీ పమిడికాల్వ చెంచు నరసింహశర్మ

జననము :- 19—8—1919

తల్లి: శ్రీమతి మంగళాంబ; తండ్రి : శ్రీ చెంచు సుబ్బయ్యశర్మ

జన్మస్థలము :- పెనగలూరు - రాజంపేట తా॥ కడప జిల్లా

రాయలసీమలో వెలుగు మొగము చూడక పల్లెలందే అడగియుండిన కవిరత్నములెందరో కలరు. వారిలో శ్రీ చెంచు

నరసింహశర్మ గారొకరు. ఈ కవిగారు నిరాడంబరులు, నిష్కపటులు. పల్లెవాసుల పసిడి హృదయము వీరిది. వ్యవసాయము చేసుకొనుచు పోతనవలె కాలము వెళ్ళబుచ్చినవారు-పండ్రెండవ యేటనుండియే, వీరికి కవిత అలవడినది. సంగీతము, జ్యోతిషము, మంత్రశాస్త్రము, వైద్యము మున్నగు వాటియందు వీరికి మంచి ప్రవేశము కలదు. చిన్నతనమునుండి వీరికి పోతన భాగవతమన్న ప్రాణము. ఆ మహాకవి వీరికాదర్శమూర్తి. అతని వలెనే వీరును సహజ పాండిత్య శోభితులు.

స్వయంకృషితో ఆంధ్రభాషావిశారద, విద్వాన్ పరీక్షలు, ముగించి తెలుగు పండితులుగా పనిచేసిరి. తమ గ్రామమందే వెలసియున్న నయనాధీశ్వరునిపై "నయనాధీశ శతకము"ను రచించిరి. ఈ శతకమునకు జనమంచి వేంకట సుబ్రహ్మణ్యశర్మ గారు పీఠికను వ్రాసిరి. "భావకుసుమావళి" వీరి మరొక ఖండ కావ్యము. నవ్యభావ గర్భితములగు పద్యము లిందు కలవు. ఇందలి "కాఫీదేవత, శిలావిలాపము, శుభాకాంక్ష, పోతన" మొదలగు ఖండికలన్నియు వివిధపత్రికలలో ప్రచురింపబడినవి;

"ఆంధ్ర భగవద్గీత" - "ఆంధ్ర సౌందర్యలహరి" వీరికి పేరు తెచ్చి పెట్టిన గ్రంథరాజములు. శ్రీ మదాంధ్రభగవద్గీత శ్లోకముల నన్నింటిని ఈ కవిగారు తేనెలూరు తేట తెనుగులో తేటగీతి, కందములలో కడు సరళముగా నెల్లరు చదువుకొని

అర్థము చేసుకొను రీతిలో అనువదించిరి. దీనిని చిత్తూరు జిల్లా యేర్పేడులోని వ్యాసాశ్రమమువారు తమ ప్రచురణగా ప్రచురించి భక్తుల కందించిరి. భగవద్గీతను, సాధన చతుష్టయ సంపత్తిగల వారందరూ సులువుగా చదువుకొనుటకు వీలుగా నుండునని శ్లోకములతోబాటు, తెనుగు పద్యములను కూడ చేర్చి ప్రకాశకులు ముద్రించిరి. ఈ భగవద్గీత అనువాద కార్యమును తిక్కన నుండి నేటి వరకెందరో కవులు గావించినను "ముక్తి సంపద యిడుగీత నెవ్వరెటు వ్రాసిన గ్రాలదె? సజ్జనాళిలోన్" అని శర్మగారు సమాధానము చెప్పుకొన్నారు.

వీరి ఆంధ్ర భగవద్గీతలోని అనువాద సరళిని కొంత చూతము,

తే.గీ. జాఱుచున్నది ధనువు-హస్తంబు నుండి
చర్మము దహింపబడుచున్న చందమయ్యె
మనసు విభ్రాంతి మయమగు, మాడ్కితోచె
నిలువజాల రథంబుపై-నిమ్మళముగ.

తే.గీ. ఎవడు ఫలకాంక్ష విడనాడి, ఈశ్వరార్ప
ణముగ నియత కర్మంబు లొనర్చు నాత
డబ్జ పత్రంబు నీటిచే నంటబడని
పగిది, దాకుడు వడడు పాపంబువలన.

ఇట్లు వీరి రచన నిరాఘాటముగా, అతి సరళముగా,

మృదుమధురముగా సులభశైలిలో సాగినది. "ఆంధ్ర సౌందర్య లహరి"-వీరి మరియొక కృతి. ఇందలి కొన్ని పద్యములు భారతి మాసపత్రికలో ముద్రితములు. 1973 నవంబరు భారతి సంచికలో ప్రచురింపబడిన పద్యములలో ఒకదాని నిందు మచ్చునకు పొందు పరచడమైనది.

సీ॥ ఘల్లు ఘల్లని మ్రోయు కనకంపు గజ్జెల
        మొలనూలు కటిభాగమున వెలుంగ
మదకరి కలభకుంభప్రాయ కుచభార
        మున వంగి మైదీవ మురువు సూప
బ్రక్షీణ మధ్యంబు బరిణత శరదిందు
        నిభ వదనంబును నీటు గులుక,
వరధనుశ్శరజాల - పాశాంకుశంబులు
        కర చతుష్టయమున గ్రాలుచుండ.

తే,గీ. త్రిపురవైరి-యహంకార దీప్తమూర్తి
విశ్వజనసంఘ నిత్యభావిత సుకీర్తి,
అలజగన్మాత యెవ్వేళ లందు మాకు
మించు దయతోడ సాక్షాత్కరించుగాత!

శ్రీ చెంచు నరశింహాశర్మ గారికి ఇరువురు కుమారులు, ఇరువురు కుమార్తెలు కలరు. పెద్ద కుమారుడు శ్రీ పమిడికాల్వ

చెంచుసుబ్బయ్య, అష్టావధానిగా ఆంధ్రదేశములో పేరు తెచ్చు కొన్నారు. లేపాక్షి ఓరియంటల్ కళాశాలలో ఉపన్యాసకులుగా పని చేయుచున్నారు. రెండవకుమారుడు చెంచు సుబ్బనరసయ్య పెనగలూరు గ్రామమునందే తెలుగు పండితులుగా పని చేయు చున్నారు. ఆదిశంకరాచార్యులవారి సౌందర్యలహరిని, భగవద్గీ తను అనువదించి శ్రీ నరసింహాశర్మగారు ధన్యతపొందిరి.

---

## శ్రీ దుత్తలూరి రామరావు

జననము :- 21—10—1939

తల్లి : శ్రీమతి లక్ష్మీదేవమ్మ;

తండ్రి : శ్రీ దుత్తలూరి చలపతిరావు.

జన్మస్థలము : మందలపల్లి-మడకశిరా తా॥ - అనంతపురం జిల్లా

అనంతపురం జిల్లా, మడకశిరా తాలూకా, అమరాపురం హైస్కూలులో 4వ ఫారము చదువుతున్న ఒక విద్యార్థి తన కున్న సహజశక్తితో పద్యములు పాటలు వ్రాయుచూ, హరికథ లను కూడా, గానము చేయుచుండుట చూచి ఆ పాఠశాలలోని ఆంధ్ర పండితులైన విద్వాన్ శ్రీ రూపావతారం నారాయణశర్మ గారు, మిగుల ఆశ్చర్యమంది ఆనందాతిశయముతో ఒకవైపు ఆ విద్యార్థియొక్క విద్యాభివృద్ధిని కాంక్షించుచూ, "పెద్దవాడైన

తరువాత వ్రాయవచ్చులే " అని సలహాయిచ్చిరి. ఆ విద్యార్థి దురదృష్టమేమో చదువు సక్రమముగా సాగినదికాదు. పూజ్యనీయులైన పద్మశ్రీ కల్లూరు సుబ్బరావుగారి ప్రేరణతో ఆ విద్యార్థి హైదరాబాదు నగరమునకు వెళ్ళి "తెలుగు విశారద" పరీక్షలకు చదువ నారంభించెను. అప్పుడే ఆ విద్యార్థి శ్రీ దివాకర్ల వెంకటావధాని గారి దృష్టిలో కూడ పడినాడు. నాటినుండి వారిరువురి పరిచయము దినదినాభివృద్ధి చెందినది. ఆ విద్యార్థియే దుత్తలూరు రామరావు.

శ్రీ దుత్తలూరు రామరావు 1960 నుండి 1970 వరకు, వివిధ ఉన్నత పాఠశాలలలో, తెలుగు పండితులుగా పనిచేసిరి. వీరి ఇష్టదైవము శ్రీ వేంకటేశ్వరుడు. తన్ను నడిపించు దైవమాతడేయని నమ్మిన భక్తకవి రామారావు. వీరికృతులన్నియు దైవసంబంధమైనవే. అందులోను శ్రీ వేంకటేశ్వరునిపై అల్లిన కవనమే అధికము. శ్రీ రాఘవేంద్రస్వామివారి చరిత్ర, శని మహాత్మ్యము లేక విక్రమార్క గర్వభంగము వీరి రచనలు. వీరికృతులలో, "నిర్వచన పద్మావతీ శ్రీనివాస కల్యాణము" ఒక రసవత్తర కావ్యము. ఇందలి పద్యములన్నియు, శ్రీ తిరుమలేశుని తోమాలసేవకు వినియోగించు వివిధ సుగంధ రమణీయ పుష్పములే.

"ఈ కావ్యము సరళమై సర్వ సుబోధకరమై రచింప

బడినది. పద్యములన్నియు, ధారాశుద్ధి శోభితములై, నిరర్గళముగ సాగిపోవుచున్నవి. అందుకు కారణము, శ్రీ వేంకటేశ్వరుని యెడ కవికిగల భక్తి విశేషమే. ఎడనెడ, వారు తెలుగు జాతీయములైన, నుడికారముల జక్కగా ప్రయోగించియున్నారు. ఈ కావ్యమంతయు, సాధారణ వృత్తపద్యముల లోనే వ్రాయబడినది. అక్కడక్కడ, మత్తకోకిలలు కనుపించుచున్నవి. వృత్త, గీత, సీస, కందములలో వేనిని వ్రాసినను కవిగారు కావ్యమునంతను సహజధారతో సాగించియున్నారు. చదువుట కారంభించినవారు, ముగియువరకు చదువక విడువరు. ఈ కావ్యమునందలి శైలీ మాధుర్యము, కథా రమణీయతయే ఇందుకు తార్కాణము" అని శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు తమ అమూల్యాభిప్రాయము తెల్పిరి.

శ్రీ వేంకటేశ్వరుడు పద్మావతిని చూచినప్పటినుండి ఆతని మనసు పరవశమైనది. ఆమెను పెండ్లాడదలచినాడు. తల్లి వకుళాదేవి కుమారుని ఊరడించి, మనోవ్యథకు కారణమడిగినది. అప్పుడు శ్రీ వేంకటేశ్వరుడు తల్లితో చెప్పిన విధమును కవిగారిట్లు వ్రాసిరి.

సీ॥ జాబిల్లి కంటెను జక్కనౌ వదనంబు
నల్లని ముంగురుల్ నటనమాడు
కనుబొమల్ ధనువులై కన్పించు వేయేల

మెఱుపుకంటె ధనువు మేల్మి యగును
ఆకాశరాజున కనుగుకూతురు పేరు
"పద్మావతీ"యన బరగుచుండు
రమణి నిజమ్ముగా లక్ష్మిదేవిని బోలు
పున్నెమ్ము బండె; నా పొలతి చూచి

గీ॥ ఆమె బొందని జన్మ నిరర్థకంబు
కోమలాంగి జేబట్టుటే కోటిసుఖము
వివరముగ నా విరహబాధ విన్నవించి
శీఘ్రముగ. వాంఛితముదీర. జేయుమమ్మ.

ఇందలి పద్యములిట్లు సరళముగా, తీగ సాగిన రీతిగా సాగిపోవుచుండును. ఇట్టి పద్యము లిందనేకములు. తదుపరి వీరి "శ్రీ వేంకటేశ్వర గానామృతలహరి" యందు, 101 భక్తి కీర్తనలు ఎల్లరూ సులువుగా పాడుకొనుటకు వీలుగా రచించిరి. ఈ పాటలు భక్తిరస భరితములు, అమృతలహరులు. ఇందు, వేంకటేశ్వరుని లీలలన్నియు వర్ణింపబడినవి. ఈ పాటలలో కొన్నిచోట్ల తత్వము, కొన్నిచోట్ల భక్తి, మరికొన్ని చోట్ల వైరాగ్యము చోటు చేసుకొన్నవి. భక్తుడైన ఈ కవి తన స్వామిని నిలదీసి యిట్లడుగుచున్నాడు.

నిన్నేమి - అనరాదు, నీ-కిదియు-సరిగాదు

కన్నయ్య - నాకిన్ని కడగండ్ల నిడరాదు

---

సర్వకాలములందు-సర్వవేళలయందు
సర్వనామములందు-సంస్మరించుచు నుంటి
నాయార్తి నాలించి నన్నేలు కొమ్మంటి
సర్వమంగళవేష-సర్వేశ! జగదీశ!

---

తనువెల్ల సొమ్ములను-తగిలించుకొని తిరుగ
అంతమోజా - నీకు - శ్రీనాథ! గోవిందా!

---

ఇన్ని బరువులమోయు-నాచిన్ని కన్నయ్య
ననుబ్రోచు భారమ్మ-నీకు భారమె? తండ్రి!

ఈ కృతికి ప్రేరకుడు - కారకుడు - ప్రకాశకుడు, ఆ కలియుగ వేంకటేశ్వరుడే యని కవిగారు చెప్పుకొన్నారు. ఇక "శ్రీ తాళ్ళపాక అన్నమయ్యచరిత్ర", "శ్రీ సత్యనారాయణ పూజా మహాత్మ్యము", "కలియుగ వైపరీత్యము", భిక్షాటనాధీశ్వర శతకము", "పాంచజన్యము", "అమృతాభిషేకము" వీరి అముద్రిత కృతులు.

శ్రీ రామరావుగారు కవులేకాక, చలనచిత్ర నటులుగా కూడ పేరు తెచ్చుకొన్నారు. మడకశిరాలో జరిగిన, సాహిత్య సభలకు ముఖ్య అతిథిగా విచ్చేసిన కీ॥ శే॥ పద్మశ్రీ చిత్తూరు

నాగయ్యగారు రామరావుగారిని, సినీరంగ ప్రవేశము చేయుటకు ప్రోత్సహించిరి. రామరావు మద్రాసుకు వెళ్ళి కొన్ని ఏండ్లు గడిపి శ్రమకోర్చి చిన్న చిన్న పాత్రలను పోషించిరి. ఇప్పుడు కూడ అవకాశము కొరకు ఎదురుచూచు చుందురు. ప్రస్తుతము వీరు అనంతపురం జిల్లా ధర్మవరం పట్టణమందు స్వంత ఇంటిలో సుఖముగా కాలము గడుపుచున్నారు. వీరికి శ్రీ వేంకటేశ్వరుడు ఆయురారోగ్య భాగ్యములనిచ్చి కాపాడుగాత!

---



## శ్రీ దేశాయి రామచంద్రరావు

జననము : 1900

మరణము : 15-1-1958

తల్లి : శ్రీమతి సుబ్బమ్మ

తండ్రి : శ్రీ దేశాయి వెంకటనారాయణరావు

జన్మస్థలము : మరూరు బండమీదపల్లె (అనంతపురం జిల్లా)

వెలుగుకురాక, అజ్ఞాతముగా నుండిపోయిన ఎంతో మంది రాయలసీమ కవులలో బండమీదపల్లె కరణము రామచంద్రరావు గారు ఒకరు.

శ్రీ రామచంద్రరావుగారు కరణముగా ప్రజల యొక్క ప్రభుత్వోద్యోగుల యొక్క ఆదరాభిమానముల చూరగొన్న వారు. ఒక వంక వృత్తిపరమైన బాధ్యతల నిర్వహించుచు, మరొకవంక సాహిత్యసేవ గావించినారు.

వీరికి స్వంత గ్రంథాలయము కలదు. విలువైన గ్రంథముల నెన్నింటినోకాని, విమర్శనాదృష్టితో వానిని పఠించినారు. కరణము లెక్కలు వ్రాయుట ముగియగానే గ్రంథముల చేత బట్టుటే వీరి పని. రాత్రి రెండు గంటలైనను పొత్తమును, పెన్సిలును విడుచుటలేదు.

పద్యరచన యందును, పద్యపఠనము నందును వీరిదొక ప్రత్యేక శైలి. శ్రీ రామచంద్రరావు గారికి సాహిత్యమునందే గాక, సంగీతము నందును పరిచయము గలదు. వీరు మధుర కంఠముతో శ్రావ్యముగ పురాణపఠనము గావించుచు, శ్రోతలను ముగ్ధుల గావించెడివారు.

శ్రీమాన్ పప్పూరు రామాచార్యులవారు, శ్రీ కల్లూరు సుబ్బరావుగారు, శ్రీ మరూరు లక్ష్మీనరసప్పగారు వీరి పురాణ పఠనమును, కవిత్వమును చాల మెచ్చుకొన్నారు.

శ్రీ రామచంద్రరావుగారు పాదుకా పట్టాభిషేకము, చిత్ర నళీయము, విషాద సారంగధర, గయోపాఖ్యానము, వరకాసుర

వధ మున్నగు నాటకములలో ప్రధానపాత్రల ధరించి ఉత్తమ నటుడుగా పేరు పొందినారు. హరికథల కొన్నిటిని గానము చేసినారు.

శ్రీ రామచంద్రరావుగారు కరణాలకు, సర్వేయర్లు కాగోరు వారికి ఉపయుక్తమగు రీతిగా "చెయిన్ సర్వే గణిత సూత్ర పద్యావళి" అను గ్రంథమును రచించినారు. అది ముద్రింపబడి నది. "శ్రీకృష్ణగారడి" యను నాటకము అముద్రితము. వీరు రచించిన "ప్రద్యుమ్నాభ్యుదయము" అను నాటకము అసంపూర్తిగ నిలిచిపోయినది.

వీరి "పరిమళపేటిక" ఒక ఖండకావ్యమునందు మనః ప్రబోధము, కరణీక రాజతీవి, కాలమహిమ, కర్షకౌన్నత్యము, దరిద్రాష్టకము, సీతాలక్ష్మణ పరిదేవనము, యమునితో ముచ్చటలు, ఏడ్పుమహిమ, గాంధీతాత మున్నగు శీర్షికలక్రింద ఎన్నో పద్యములు, గేయములు వ్రాయబడినవి. ఇందలి పద్యములు కొన్ని ఆంధ్ర గ్రామపాలన, సారథి, విజయవాణి, సాధన పత్రికలలో ప్రకటింపబడినవి.

మచ్చునకీ పద్యహాలు చూడుడు

మ॥ మనసా! చంచలమై చెలంగు పథియున్
"మా" మైత్రితో నొప్పెడు

స్వీనుమా: మన్మథ-మత్స్య-మర్కట-మరు
న్మేఘో-మనో-మానినీ
యనగా; మా-మదిరా-మధువ్రత సమా
ఖ్యల్ దాల్చి; పూర్వంపు నీ
చనవున్ గాంచుట దక్కవాని కొదవెన్
చాంచల్య భావంబులున్.

ఉ॥ ఎప్పటి కంటె నేదయిన నింత జపంబొనరింప గూరుచు
న్నప్పుడు పుట్టు నీకు దెవులక్కట! యొక్క నిమేషమేని గప్
చప్పున నుండ; వేమిటివొ చచ్చియుజావని యూహలన్నినీ
కప్పుడె పుట్టుచుండు; సమయంబిక లేదొకొ పాపిచిత్తమా!

కర్షకౌన్నత్యము.

సీ. బలరామునకు జూడ హలముమాత్రమె కాని
పసరంబు భూమి లే దసలు కృషికి;
పశుపతి కన్ననో పశువొక్కటియె కాని
భూమియు నాగలి పొసగలేదు;
కమలేశునకు భూమి కల దింతయే కాని
హల వృషభ విభూతి యమరలేదు;
ముగు రెకమైనను ముగియదు సేద్యంబు
రెండవ యెద్దు లే కుండు కతన;

గీ. ఇట్టి దారిద్ర్యపు సమాజ మెట్లు సాటి

హాల వృషభయుగ్మ విశ్వంభరాగత ప్ర
కర్ష వైభవ వ్యవసాయ కలితుడవగు
కర్షకా! నీకు? లేరు నీకంటె ఘనులు.

నిత్య సంతోషిగా, నిర్మల హృదయుడుగా, నిరతాన్న దాతగా, అజాత శత్రువుగా రాణించిన కరణము శ్రీ దేశాయి రామచంద్రరావు గారు జీవితము నంతయు గ్రంథ పఠనమునకు, సాహిత్యసేవకు ధారవోసి 58 వ ఏట స్వర్గస్థులైరి. వీరు అజ్ఞాతముగా నుండుటకు కారణము కరణీకమే.

---



"కవియిత్రీ తిలక"

## శ్రీమతి కొలకలూరి స్వరూపరాణి

జననము : 1-5-1943

తల్లి : శ్రీమతి మంగాదేవి

తండ్రి : శ్రీ గోవాడ ఎన్. వి. రత్నం

జన్మస్థలము : గోవాడ - తెనాలి తా॥ గుంటూరు జిల్లా

వృత్తిరీత్యానివాసము :

మోదా గ్రామము; హిందూపురం తా॥ అనంతపురం జిల్లా

నేటి తెలుగు సాహిత్యంలో నవలలు వ్రాస్తున్న నవలామణులే ఎక్కువ. నేడు ఆ నవలల కున్న నిలువ, స్థానము మరే సాహిత్య ప్రక్రియకులేదు. నేటి మన పాఠకలోకం నవలా రచయిత్రులకే పెద్దపీఠం వేసింది. రచయిత్రులు కూడ ఈమధ్య వంటిల్లు విడిచి విశాల ప్రపంచం మనకంటూ ఒకటుందని ఎంచి అనేక విషయాలను తమ నవలల్లో చొప్పిస్తున్నారు. సస్పెన్స్, థ్రిల్లింగ్, కిల్లింగ్, హారర్, టెరర్ మఱియు వైజ్ఞానిక, సామాజిక నవలలను కూడ చకచకా వ్రాస్తున్నారు. పత్రికలు కూడ వాటిని అతివేగంగా పాఠకుల ముందుంచుతున్నాయి. ఇప్పటి తెలుగు రచయితల సంఖ్యలో అధిక శాతం స్త్రీలదే. ఇంతమంది రచయిత్రులున్నా పై సాహిత్య ప్రక్రియ కాక అన్యమైన వాటిలో కృషిచేసి మంచిపేరు తెచ్చుకొన్నవారు అరుదు. కవయిత్రి అనే సార్థకనామం కొందరికే దక్కింది. వారు కూడ వేళ్ళపై లెక్కపెట్టవలసినవారే. చక్కటి పద్యములు, కవితలు వ్రాయగలిగిన నేర్పు ఏ కొందరు రచయిత్రులకో అబ్బింది. అలాంటి ఓ రచయిత్రి హిందూపురం పంచాయితీ సమితిలో ఉపాధ్యాయవృత్తిని చేపట్టి వుండటం గర్వకారణం. ఆమె శ్రీమతి కొలకలూరి స్వరూపరాణి. అసంఖ్యాక పద్య,గద్య,గేయ వచన విమర్శనాత్మక రచనలను, వాటికితోడుగా నేటి పాఠక లోకం మెచ్చేకథలు, నవలలు కూడ రచించి వాసికెక్కి పేరు సంపాదించుకుంది.

ఈ కవయిత్రి రచించిన "గంగావతరణ-శివతాండవము" "చంద్రగ్రహణము" అను రెండుపద్యకావ్యములను చదివినప్పుడు వీరి ప్రజ్ఞకు, కవితాశక్తికి, భావస్ఫురణకు అచ్చెరువొందని వారు లేరు. విద్వన్మణి - శ్రీ కట్టా వేంకట సుబ్రహ్మణ్యం ఎం.ఏ.- గారొకసారి ఈమె వ్రాసిన శివతాండవ కావ్యమును చూచి ముగ్ధుడై ఏదో అనిర్వచనమైనశక్తి ఈమెలో ఆవహించి ఉందని అది వాగ్దేవతా కటాక్షమై యుండునని భావించిరి. ఈ నిర్ణయము వారి దొక్కరిదే కాదు. ఈమె గ్రంథములు జదివిన ప్రతి యొక్కరికి కూడా అదే అభిప్రాయమే కలదు. ఆమె తన కవిత్వమును గూర్చి ఇట్లు వ్రాసుకొన్నది.

కం॥ స్వతహాగా, ఒనగూడిన
నితాంత సాహిత్య గంధ నిర్మల కవితా
లతాంత వేణిని, సార
స్వత ప్రాణి స్వరూపరాణి, సవినయ వాణిన్

ఇంకనూ ఈ కవియిత్రి స్వవిషయమును ప్రస్తావించుచూ తన ఆశయమును గూర్చి యిట్లు వ్రాసుకొన్నది.

లేదు విశేషప్రజ్ఞ లవలేశము, సారవచో విధానమున్
లేదు, కవిత్వ ప్రౌఢిమయు లేదిక, యున్నది హృచ్ఛతఘ్ని నా
వేదనగంధకాప్తి యనువిద్ధ సముద్ధతి ప్రేలి లోక ని
ర్వేద మహీధరాశ్మతతి భిన్నమొనర్చిన చాలు మత్కృతుల్.

వీరి "గంగావతరణ - శివతాండవము" ఒక ద్విపద కావ్యము. ఇందు నూరు ద్విపదులు కలవు. "ఇందలి రచన దీర్ఘదీర్ఘములైన సంస్కృత సమాసములతో నిండియున్నది. అందందు ముచ్చటగా కూర్చిన చిన్నచిన్న సమాసములు కూడ కలవు. ఇందలి సమాసముల కూర్పు చాల పరిణతమైనది. ఎంతో అభ్యాసముండినగాని రచనలో ఇంతటి పరిణతి సంపాదించుట తేలిక గాదు. రచనలోనేకాదు భావ గంభీరతలో ఈమె పటిమ గల కవయిత్రి."

నిజమైన ఆధ్యాత్మిక చింతన, సామాజిక స్పృహకు వ్యతిరేకము కాదని కవయిత్రి భావించి, ఆమె తన శివతాండవ కావ్య నాయకుడైన శివుని సమాజ వికాస నాయకునిగా లెక్కించి, ఆతని సుహృద్భావ మెంతటిదో సవిస్తరంగా వివరించింది. ఈమె శివుని స్త్రీ జనోద్ధారకుడుగా, స్త్రీకి సమాన ప్రతిపత్తి నొసగిన ఔదార్యుడుగా, ఇరువురు భార్యలకు తన్ను తాను ఆత్మార్పణ గావించుకొన్నవానిగా, ఆదర్శమూర్తిగా, గిరి తనయను వివాహమాడి బలహీనవర్గాలు అనగా గిరిజనుల సంక్షేమానికి నాంది పలికినవాడుగా, శ్రీహరి పాదమందు బుట్టిన శూద్రబాలిక యగు, (హరిజన) గంగమ్మను స్వీకరించి అస్పృశ్యతను నివారించిన ప్రథమ అభ్యుదయవాదిగా ఆమె భావించినది. అట్టి సభ్య సంస్కారాలకు దర్పణము పట్టిన శ్రమజీవి చుట్టూ అల్లిన

కవితలో సామాజిక స్పృహ లేదనడం వట్టి మూర్ఖత్వమే అవు తుంది. ఈ దృష్టితో కవయిత్రి తన హృదయ పీఠికపై శివుడు సలిపిన తాండవమునకు కవితా స్వరూప మిచ్చింది. ఆ భావననే పాఠకులు కలిగించుకొన్నప్పుడు ఇందలి విషయం మరింత అర్థ స్ఫూర్తిని కలిగిస్తుంది. వీరి శివతాండవ రచన యిట్లు సాగినది.

కనకకిరీటప్రకట నవరత్న-గణఘంటికావళి గణగణలాడ
షణ్ముఖగజముఖ చకిత సామీప్య-సన్మానమున సమక్షంబురంజిల్ల
నందీశ భృంగీశ నమ్రనాట్యాభి-నందనోపశ్రుతి నయగారమొలుక
అమరేందుబింబాననా బాహువల్లరీముక్తసురపుష్పరింఛోళిగురియ

— — — — —

శారికాకోటులై సందడిచేయ ఈరేడులోకాల ఏలికపూన్కి—
ధారుణి గంగావతరణశ్రీసెసగ గౌరీప్రియుండు గంగాధర నామ
బద్ధప్రసిద్ధికాస్పదుడయి వెలయ ఇద్ధ జలక్రీడ నేపుమీరంగ
విహరించి విహరించి విరమించిదరిని రహించు రాజమరాళంబు
రీతి.

— — — — —

గురు,జటాజూటానుకూల,కూలపముల సురసాలవతి విభాసురలీల
నురికె.

తదుపరి వీరి చంద్రగ్రహణ కావ్యము సమకాలీనతకు, సముజ్జ్వల భవిష్యత్తునకు నవ్య భావనలకు దర్పణము.

భూగోళమునకు, ఖగోళమునకు వారధి నిర్మింపజేయడం ఈకావ్య మందలి కథావస్తువు. "ఆర్యభట్ట" ఉపగ్రహాన్ని, 1975 లో భారతప్రభుత్వం, ప్రప్రథమంగా అంతరిక్షంలోనికి ప్రయోగించింది. దేశం సాధించిన వైజ్ఞానిక ప్రగతి కవయిత్రి హృదయాన్ని కుదిపివేసింది. భూమిచుట్టూ "ఆర్యభట్ట" పరిభ్రమిస్తున్నది. చంద్రుడుకూడ అదే కక్ష్యలోనే భూమిచుట్టూ తిరుగుతున్నాడు. ఒకవేళ "ఆర్యభట్టకు" చంద్రుడు తటస్థపడితే వాళ్ళ మధ్య జరిగే సంభాషణ ఎలా వుంటుంది? ఏయే అంశాలపై చర్చించుకొంటారు? అన్నదే ఈ కవయిత్రి ఊహ. ఆ ఊహా జగత్తుకు జరిగిన అంకురార్పణే "చంద్రగ్రహణ" కావ్యంగా వెలుగు చూసింది. ఈ రసమయ ఊహా చిత్రణలో కవయిత్రి "చంద్రుణ్ణి" స్త్రీగా మార్చింది. అతనికి స్త్రీ పాత్రను కేటాయించింది. ఆ చంద్రమ్మ, తనకు పట్టిన గ్రహణాన్ని గూర్చి ఆర్యభట్టునకు మొరపెట్టుకొంటుంది. తననీ అవస్థనుండి తప్పింపుమని కోరుతుంది. అట్లే ఆవిడ(చంద్రమ్మ) తాను గమనిస్తున్న మానవ సమాజంలోని సమస్యలకు పరిష్కారమార్గం సూచిస్తుంది. నూత్న విజ్ఞాన విశేషాంశాలను గూర్చి ముచ్చటిస్తుంది. ఈ మూడు విశేషాల - త్రివేణీ సంగమమే "చంద్ర గ్రహణ" కావ్యము.

ఇదొక నవ్య కవితాప్రక్రియ. ఇట్టి కావ్యము ఆంధ్ర

సాహిత్య చరిత్రలో అరుదు. నవ్యకవితా సంపుటాలలో భావాలు తొంగి చూడవలెనేగాని, ఛందస్సుకాదు. భావాన్ని బంధించే శక్తి ఛందస్సునకు లేదు. అందుకే ఈ కవయిత్రి కొన్ని వర్ణనలను అత్యాధునిక భావాలతో వర్ణించింది. ఇది తప్పేమీకాదు. భావాలకు సంకెళ్ళు వేయడంగాని, యిట్టి వర్ణనలే సాంప్రదాయములు, సమంజసములని ఎక్కడా నిర్ణయింపబడడంగాని జరుగలేదు. సమాజపరంగా అల్లిన భావాలు సహజ సుందరంగా వుంటాయి. ఆ వర్ణనలు కొంతవరకు సమాజాన్ని ప్రగతి పథంలోకి పయనింపజేయగలవు. ఆ భావనతోనే, స్వరూపరాణి గారు వర్ణనలు గావించిరి.

సూర్యాస్తమయ వర్ణనకు చెప్పిన ఉపమాన మొకటి చూచిన చాలును, అది నేటి సమాజంలోని కొంతమంది వ్యక్తులపై ఎలా కొరడా ఝళిపించిందో విదితం కాగలదు.

మనుపున కట్నమెల్ల తన మామ యొకేపరి క్రక్కడించు, లా
శి, నవల వైచియున్ విడచి లేజెలువన్ తరిలో చివాలునన్
జను, వరుడో యనంగ మలుసంజ ముహూర్తములోన, పద్మకాం
తను, నడియేటిలో వదలి తా నరిగెన్ రవి పశ్చిమాశకున్.

ఇట్టి మనోజ్ఞ భావయుక్తములగు పద్యములే గాదు, సుదీర్ఘ, సమాస భూయిష్ఠ, క్లిష్టతర పద్యములతోపాటు, ప్రాచీన

ప్రబంధశైలి నేమరక అటనట వ్రాసిన రమ్యములగు పద్య సుమములను కూడ ఈ నవ్య కవితాకన్యక తన సిగలో నలంకరించుకొన్నది. ఇందు కవయిత్రి తన మనోభావముల నన్నింటిని వివిధ శీర్షికలుగా విభజించి తానే ఆర్యభట్టుకు(లోకానికి) వినిపించుకొన్నట్లు నిగూఢ భావనతో తెల్పినది. అందుకే ఆమె ఇందులో చంద్రమూర్తిని స్త్రీమూర్తిగా చిత్రీకరించింది. తుదకామె (చంద్రమ్మ) ఇట్లనుచున్నది.

నవలాజాతి యెడల తగు
అవగాహన కుదిరెనేని హక్కులు చట్టాల్
సవరించినంత పుణ్యము,
తెవు లెరుగని మందు లార్చి తీర్చునె రుజలన్?

పై రెండు కావ్యముల తరువాత స్వరూపరాణి గారు "ప్రబోధం" అను ఒక గేయ సంపుటిని, "నన్నయమహిళ" అనబడు పరిశీలనా గ్రంథమును వ్రాసిరి. ఈ పరిశీలన గ్రంథములో ఈమె అనాదిగా స్త్రీకి స్వాతంత్ర్యము లేకుండా పోయిందనే ఆవేదన వ్యక్తపరుస్తూ అనేక ఉదాహరణలను మహాభారతంలోని నన్నయభాగం నుండి గ్రహించింది. ఆమె అభిప్రాయాన్ని ఈ గ్రంథములో యిలా వ్యక్తపరిచింది.

"పుట్టింటి హక్కులను రద్దుచేస్తూ, ఇటు భర్తకు భార్యపై

సంపూర్ణాధికారాన్ని కట్టబెడుతూ, స్త్రీని రిక్తహస్తురాలిగా పడ గొట్టుతుంది వివాహవ్యవస్థ. ఆ వివాహ వ్యవస్థకు ప్రతిబింబాలు భారతంలోని స్త్రీ పాత్రలు. ఈ సంకెళ్ళనుండి స్త్రీకి విమోచనం కావాలి" అనే భావాన్ని రచయిత్రి తెల్పి చెప్పింది.

సారస్వతోపన్యాసములు, రేడియో ప్రసంగాలు, పత్రిక లలో రచనలు లెక్కలేనన్ని చేసిన ఈ కవయిత్రి ధ్యేయం- వసుధైక కుటుంబమైన సమసమాజ స్థాపన, కులమత వర్గాతీత సమాజకాంక్ష. కవయిత్రికాంక్ష ఈడేరేకాలం వచ్చింది.

"విద్యాధర ప్రభాస" అనబడే సాహిత్య సంస్థ నెలకొల్పి తద్వారా తమ ప్రచురణలను వెలుగులోనికి తెచ్చిన శ్రీమతి కొలకలూరి స్వరూపరాణి గారికి వారి కుటుంబమునకు భగ వంతుడు సుఖ శాంతులను ఆయురారోగ్య భాగ్యములను యిచ్చి సర్వదా కాపాడుగాత!





# శ్రీమతి గుంటి లక్ష్మీకాంతమ్మ

తల్లి: శ్రీమతి చిదంబరమ్మ

తండ్రి :

శ్రీ కాశీభట్ల పెద్ద సుబ్బయ్య

భర్త: గుంటి నంజుండశర్మ

జననము : 21-7-1930

జన్మస్థలము : వజ్రకరూరు - గుత్తి తా॥ - అనంతపురం జిల్లా

శ్రీమతి గుంటి లక్ష్మీకాంతమ్మ గారు గేయ రచయిత్రి. వజ్రకరూరు చిన్నగ్రామమగుట చేత, పెద్ద చదువుల కాస్కారం లేదు. పుట్టినఇల్లు వేదాధ్యయన సంపన్నమైనది. కాన బాల్యము నుండియే, ఈమెకు దైవభక్తి అలవడినది. మెట్టిన ఇల్లు కూడా దైవభక్తి సంపన్నమై యుండుటవల్ల, ఈమెకు బంగారుకు పరిమళ మబ్బినట్లు, దైవభక్తికి ప్రోత్సాహ మబ్బుటవల్ల అనేక భక్తి రస గేయములను రచించి, తమ ఇంట పాడుకొనెడివారు.

1964లో "నక్షత్రమాల" వ్రాసి ప్రకటించిరి. శ్రీమతి ఊటుకూరు లక్ష్మీకాంతమ్మగారు, ఈమె వాగ్గేయ కారుల కోవకు చెందినదని ప్రశంసించిరి. "మందారమాల" ఈమె వ్రాసిన రెండవ గేయరచన. 1968లో హైదరాబాదులో జరిగిన "అఖిల

భారత రచయితల మహాసభ"లో ఈమె కవితాగోష్ఠిలో పాల్గొని "మందారమాల" గేయములను, పాడి వినిపింపగా, అకాడమీ కార్యదరి శ్రీ దేవులపల్లి రామానుజంరావుగారు, సంతోషపడి ఆ పుస్తక ముద్రణమునకు సహాయపడిరి.

"రచనాపాటవ మున్నవారికి గాత్ర సౌలభ్యము లేక పోవుట, గాత్ర సౌలభ్య మున్నవారికి రచనా సౌలభ్యము కొఱ వడుట సహజము. కాని, ఈ కవయిత్రికి రచనా పాటవముతో బాటు గాత్రసౌలభ్యము భగవంతుడు ప్రసాదించుట బంగారుకు పరిమళ మబ్బినట్లున్నది." అని తిరుపతి సంస్కృత కళాశాల రిటైర్డు ప్రిన్సిపాలు గారైన శ్రీ చేబ్రోలు సుబ్రహ్మణ్యశర్మగారు ప్రశంసించిరి.

ఈ క్రింద, "మందారమాల"లోని కొన్ని గేయములను "స్తుతిమాల" లోని రెండు కీర్తనలను, అముద్రితమైన, "రుక్మిణీ కల్యాణము" లోని రెండు గేయములను పాఠకులు చదువగలరు.

"మందారమాల"లో కొన్ని గేయములు.

౧

అలుక ఏలనో? అలివేలమ్మా పలుకగ రావమ్మా!
పిలిచి పిలిచి నిను-అలసితినమ్మా! అలుక మానవమ్మా!
దేవీ! పలుకగ రావమ్మా!

౨

కనివిని యెరుగని-కరుణాలయవని విన్నానోయిమ్మా!
కరుణజూపి-శరణన్న వారికి దరిశనమేయిమ్మా!
దరిశనమిమ్మా!

౩

కరుణించుతల్లీ! శరణంటిగౌరీ! శర్వాణీ! గిర్వాణీ! కల్యాణీ!
తల్లి నీవే! తండ్రివి నీవే! గురుదైవము నీవే! దయనుజూపి-
దరిని చేర్చు దాతవు నీవే!
కర్పూరహారతిదె! గైకొనవమ్మా! శ్రీకాంతా!

"శ్రీ రుక్మిణి కల్యాణము"లోని రుక్మిణి ప్రార్థన (గేయము)

౧

నీ చరణంబుల-నీడనుచేరి శరణంటిని-నీ కరుణగల్గదా?
తరుణము మించక-తరలి రానిచో మరణమె - శరణము-
కరుణాభరణా!

౨

"అమ్మ"ను గని యామమ్మె-అమ్మయని "అమ్మా"! నిను
మది నమ్మితినమ్మా!
నా మనోహరుని నా కొనగూర్పుము లేకుండిన, నను
నీలో చేర్చుము

ఈ కవయిత్రి మఱికొన్ని భక్తి గేయములను వ్రాసి
ఆంధ్రలోకమున కర్పించుగాత!





## శ్రీ చౌళూరు రామరావు

జననము :- 28-3-1916

తల్లి : శ్రీమతి నరసమ్మ

తండ్రి : శ్రీ సి. మధ్వరావు

జన్మస్థలము :- చౌళూరు,

హిందూపురం తాలూకా

అనంతపురం జిల్లా

తెలుగు సాహిత్యంలో అనువాదం ఒక విశిష్ట ప్రక్రియ. అనువాదకుడు ఈ ప్రక్రియ ద్వారా ఇరుభాషలలోని సాహిత్య మాధుర్యాన్ని పాఠకలోకానికి అందివ్వగలుగుతున్నాడు. కన్నడ భాషనుండి ఇప్పటికే ఎన్నో గ్రంథాలు తెనుగులోనికి అనువదింపబడియున్నాయి. ఈ అనువాద ప్రక్రియ ఎక్కువగా కన్నడరాష్ట్రమునకు చేరువగాను, కన్నడరాష్ట్రముతో ఎక్కువగా సన్నిహిత సంబంధాలు కలిగిన పొరుగురాష్ట్రాల రచయితలు కొందరు తమ భాషలోనికి రత్నాలవంటి కన్నడ రచనలను అనువదించి "కన్నడకస్తూరి" ని గుబాళింపజేసిరి. అట్లే "తెలుగు తీపి"ని కూడ కర్ణాటకులు గ్రహించినారు.

ఆంధ్ర, కర్ణాటక సరిహద్దు ప్రాంతంలో పుట్టి పెరిగిన

వారికీ రెండు భాషలపైనా అవ్యాజమైన ప్రేమానురాగాలు సహజముగా ఏర్పడును. కన్నడ, తెలుగుభాషా శారదలు, వారిండ్లలో సతము నాట్య మాడుచుండుదురు. అట్టి సరిహద్దు ప్రాంతపుపల్లె, చౌళూరు. ఇది అనంతపురం జిల్లా, హిందూపురం తాలూకాలో వున్న గ్రామము. ఈ పల్లెలోని రైతులు కొందరు నేటికి తమ భూములశిస్తులు కొంతభాగము కర్ణాటకప్రభుత్వ ఖజనాకు, మరి కొంతభాగము హిందూపురం తాలూకా ఖజానాకు కట్టుచున్నారు. ఇట్టి చౌళూరు గ్రామములో ఒక సదాచార పరాయణుల యింట పుట్టినవారు శ్రీ రామరావుగారు.

శ్రీ చౌళూరు రామరావు చిన్నతనము నుండి ఆంధ్ర, కన్నడ రాజ్య రమామణుల యిండ్ల నాడిపాడిన విద్యాఖని. తండ్రి చౌళూరు మధ్వరావుగారు పేరుమోసిన ఉపాధ్యాయులు. నలువది సంవత్సరముల కాలము చౌళూరులో అవిచ్ఛిన్నముగా ఉపాధ్యాయవృత్తి నవలంబించి ఖ్యాతి నార్జించినవారు. వీరి ప్రథమ సంతానమే మన రామరావుగారు.

సి. రామరావుగారు హిందూపురం తాలుకాలో (అనంతపురం జిల్లా) 1934 నుండి సుమారు పదేండ్లకాలము ఉపాధ్యాయులుగా పనిచేసి, తదుపరి సుమారు 20 సంవత్సరముల కాలం ప్రాథమిక పాఠశాలల తనఖీ అధికారిగా (స్కూల్ ఇన్‌స్పెక్టర్) పనిచేసి 1971లో పదవీ విరమణ పొందిరి. ఉద్యోగ విరమణా

నంతరము సమాజహిత కార్యక్రమములందు విరివిగా పాల్గొన సాగిరి.

శ్రీ రామరావు మంచివక్తగా జిల్లాలో పేరు గడించిరి. వీరి ఉపన్యాసములు శ్రోతలను మంత్రముగ్ధుల గావించును. చక్కటి హాస్యప్రియులు. చమత్కారముతో కూడిన ఉపన్యాస ప్రసంగములు గావించుట వీరికి పుట్టుకతో అబ్బిన విద్య. సమయస్ఫూర్తి, నేర్పరితనము, సహజ సంస్కరణాభిలాష కుండబద్దలు కొట్టినట్లు మాట్లాడటం వీరికున్న సహజ గుణాలు.

ఉడిపి పేజావర స్వాములైన శ్రీ విశ్వేశతీర్థ శ్రీపాదుల వారికి వీరు ప్రియశిష్యులై వారి వెంట ఆంధ్ర ప్రాంతములు తిరుగుచూ వారిచ్చు కన్నడ ఉపన్యాసములను అతి చక్కగా, సరళముగా, మధురముగా హాస్యాన్ని అక్కడక్కడ జోడిస్తూ అనువదించేవారు. అప్పుడే వీరికి స్వామిజీవారి కన్నడ రచనలను తెలుగులోనికి అనువదింపవలెననెడి ఒక గొప్ప ఆలోచన కలిగినది. స్వామి కృపవల్లనూ, వారి అనుగ్రహమువల్లనూ వారి రచనలను, ఉపన్యాసములను తెనుగున కనువదించి ధన్యులయిరి.

చౌహారు రామరావుగారు తొలుత స్వామిజీ వారి, "గీతా సారోద్ధార" మను కన్నడ బృహద్గ్రంథమును తెనుగులోనికి అనువదించిరి. ఆ అనువాదము నెల్లరూ మెచ్చిరి. కొందరు

దానిని తెలుగు గ్రంథముగానే లెక్కించిరి. అందలి విషయము లెల్లరకు సుబోధకములు. స్వామిజీవారు దానిని ముద్రించి ఆంధ్రదేశ మెల్లెడలా విస్తృత ప్రచారము గావించిరి. అప్పటి నుండి రామరావుగారికి స్వామిజీ రచనలపై గురుత్వ మేర్పడి వారి కన్నడ గ్రంథములైన "గీతాంజలి" - "తత్త్వాంజలి"- "విశ్వేశవాణి" అనువదించి, ముద్రించిరి. "వాదిరాజులచరిత్ర" "శ్రీ రాఘవేంద్రస్వాముల చరిత్ర" స్వతంత్రముగా రచించి, ముద్రించిరి.

"గీతాసారోద్ధార" మందు శ్రీ విశ్వేశతీర్థ శ్రీపాదుల వారు హుబ్బళ్ళిలో చాతుర్మాసకాలమున భగవద్గీతను గూర్చి యిచ్చిన నలువది ఉపన్యాసములు కలవు. ఆ గ్రంథమిప్పటికి మూడు పునర్ముద్రణములు పొందినది. అందుకు కారణము అనువాద మందలి సౌందర్యశైలి. దీనిని చదువరులు మిక్కిలి మెచ్చుకొనిరి. తదుపరి శ్రీ స్వామివారి శ్రేష్ఠ వ్యాఖ్యానము నుండి స్వారస్యకరములైన భాగములనేరి "గీతాంజలి" కూర్చ బడినది. ఒక్కసారి చదివిన చాలు చిరకాలము జ్ఞాపక ముండు టకు వీలైన సులభశైలితో "గీతాంజలి" వ్రాయబడినది.

"వాదిరాజుల" వారు మాధ్వ యతిశ్రేష్ఠులు. సజీవముగ బృందావన ప్రవేశము గావించిన తొలి మాధ్వయతీంద్రులు వీరు. రెండవవారు శ్రీ మంత్రాలయ రాఘవేంద్ర స్వాములవారు. వాది

రాజులవారు తమ జీవితకాలములో చేసిన పనులు, చూపిన మహిమలు. సంపాదించిన తపశ్శక్తి అపారములు, అనూహ్యములు. ఇంతటి మహిమాన్వితులు లోకోపకారులగు శ్రీ వాదిరాజులవారి దివ్యచరిత్ర చాలమంది ఆంధ్రులకు తెలియదు. ఆలోటును తీర్చనెంచి శ్రీరామరావు వాదిరాజులవారి ప్రేరణతో అనేక కన్నడ గ్రంథములను పరిశీలించి తెనుగున వచన రూపమున "శ్రీ వాదిరాజులచరిత్ర" అను పేర పుస్తకమును ప్రచురించిరి. శ్రీ వాదిరాజులవారికి శ్రీ మహావిష్ణువు హయగ్రీవ రూపమున ప్రత్యక్షమై వీరు సమర్పించు నైవేద్యమును ప్రతిరోజు ఆరగించి పోవుచుండిరట! అట్టి మహనీయుని చరిత్ర అతి సులభశైలిలో తెనుగుభాషలో రామరావుగారు రచించి ధన్యులైరి.

"శ్రీ విశ్వేశవాణి" పేజావరు స్వాములవారి ప్రసంగాలలోని "ఆణిముత్యాలు". ఈ ప్రసంగములు సామాన్యులకు ధర్మాచరణయందు శ్రద్ధాసక్తులను కలిగించ వచ్చునని అనువాదకులు యోచించి వాటిని క్రోడీకరించిరి. అందలి ఒక ఆణిముత్యము నుదహరించుచున్నాము.

"గృహము భవనమని పరిగణింప బడవలెనన్న అచ్చట భగవద్భక్తి – భగవద్భజన మున్నగునవి జరుగుచుండవలెను. ఇట్లు భగవత్ సంపర్కములేనిచో అది "భ"కారము పోగొట్టుకొన్న "వన" మనిపించుకొనును. అచట నివసించువారు

భవనవాసులైన మానవులగుటకు బదులు వనవాసులైన పశువులే అగుదురు" ఇట్టి జ్ఞానోపదేశమును గావించు సూక్తు లిందు పెక్కు కలవు.

శ్రీ చాగూరు రామరావుగారు అనువాదకర్త లేకాక సంఘ సేవాకర్తలు కూడ. హిందూపురం తా॥ బ్రాహ్మణ సంఘమును స్థాపించి, దాని కధ్యక్షులై పేద బ్రాహ్మణ వర్గమునకు చెందిన విద్యార్థులకు అన్నివిధములా సహకారముల నందించిరి. అట్లే హిందూపురం లేపాక్షి పట్టణములందు శ్రీ చింతలపాటి బాపిరాజు ధర్మసంస్థ - చిననింద్రకొలను వారిచే ఓరియంటల్ హైస్కూలు, కళాశాలలు స్థాపింపబడుటకు వీరెంతయో శ్రమించి విద్యా వ్యాప్తికై కృషిచేసిరి. విశ్వహిందూపరిషత్ కార్యక్రమములందు విరివిగా పాల్గొనుచుందురు. హిందూపురంనందలి శ్రీరాఘవేంద్ర స్వామిమఠస్థాపనకు వీరు చేసినసేవ అపారము. కీ॥ శే॥ పద్మశ్రీ కల్లూరు సుబ్బారావుగారికి వీరు కొన్నిఏండ్లు ఆంతరంగిక కార్య దర్శిగా వ్యవహరించిరి.

వయసు ముదిరినకొద్ది వీరిలో ఉత్సాహ మినుమడించి యువకులవలె సమాజసేవ కుద్యుక్తులగుచుందురు. ఇట్టి డెబ్బది ఏండ్ల నవయువకునకు భగవంతుడు ఆయురారోగ్య భాగ్యముల నిచ్చి సర్వదా కాపాడుగాత!





## శ్రీమతి గొల్లాపిన్ని రామలక్ష్మమ్మ

జననము :- 29-7-1922

తల్లి : శ్రీమతి కాశీభొట్ల విశాలాక్షమ్మ

తండ్రి : శ్రీ కాశీభొట్ల మల్లికార్జునశాస్త్రి

జన్మస్థలము : చిన్నముష్టూరు ఉరవకొండ తా॥ - అనంతపురం జిల్లా

విద్య : ప్రాథమికవిద్య మాత్రమే.

ఆంధ్ర గీర్వాణ భాషాభ్యాసము భర్త్తగారి వద్ద జరిగినది. వ్రాసిన గ్రంథములు : 1) జ్ఞానశతకము. 2) శివకవచము. 3) స్వప్నశాస్త్రటీక 4) శ్రీ విద్యా పద్మపరిమళము. అన్నియూ అముద్రితములే. వీరి శ్రీ మాతస్తుతి - గేయమును చదువుడు.

మాతృకే-శ్రీమాతృకే-జగధాధారభూతే-జగన్మాతృకే
చిత్రే-మహాచిత్రే-చిద్రూపికే-చిత్స్వరూపిణే
కాత్యాయినీ-దాక్షాయినీ-కామిత ఫలదాయినీ
అభయంకరీ-పరమేశ్వరీ-జగదీశ్వరీ-చండీశ్వరీ

ఏ రీతి నిన్ను నుతియింతునమ్మా! - ఎన్నెన్నో శ్లోకాల స్తుతియింతునమ్మా. ప్రస్తుతము ఈమె భర్త్త - పుత్రులతో హిందూపురం తా॥ పరిగిలో నివసించుచున్నారు. ★



డా॥ సత్త్రాజు
# లక్ష్మీ నరసింహారావు

జననము: విక్రమ, ఫాల్గుణ పౌర్ణమి (1941)

తల్లిదండ్రులు :

శ్రీమతి లక్ష్మీనరసమ్మ

శ్రీ సత్త్రాజు కృష్ణయ్య

జన్మస్థలము : కావలి. నెల్లూరు జిల్లా-ఆం.ప్ర.

ప్రస్తుత నివాసము : హిందూపురం - అనంతపురం జిల్లా - ఆంధ్ర

శ్రీ సత్త్రాజు లక్ష్మీనరసింహారావు సాధారణ మధ్యతరగతి కుటుంబములో జన్మించి, బాల్యము నుండియు సత్సంప్రదాయములో పెరిగిన గుణశీలురు. వీరిలో సాహిత్యాభిరుచిని చిగురింప జేసినవారు శ్రీరాం వేంకట భుజంగరాయశర్మ గారు. అభినివేశంతో ఆంధ్ర సాహిత్యమును అభ్యసించినారు. ప్రస్తుతము వీరు హిందూపురం పట్టణమందలి యస్. డి. జి. యస్. కళాశాలలో ప్రధానాంధ్రోపన్యాసకులుగా పనిచేయుచున్నారు.

నరసింహారావుగారు రచనలలోగల కథ, కవిత, వ్యాస, నవల, నాటిక మున్నగు వివిధ ప్రక్రియల నన్నింటిని చేబట్టి

తనదైన వ్యక్తిత్వంతో భాసింపజేసినవారు. వీరు మంచివక్తలు.

శ్రీ నరసింహారావు బహుగ్రంథ కర్తలు కాకపోయినా, బృహద్గ్రంథ కర్తలు. వీరిని సామాన్యులుగా లెక్కించుటకు వీలులేదు. మహాసముద్రముల నీదగలిగిన గజఈతగాడేకాదు-అందలి అనర్ఘరత్నముల నేరి రాశిగా పోయగలిగిన అన్వేషి. కవిత్రయ మహాభారతము ఒక మహాసముద్రమే కదా! అందలి అలంకారముల నేరి వాటిని గూర్చి సమగ్ర పరిశోధన గావించి వాటిని వెలికిదెచ్చి ప్రకాశింపజేసిన ఘనులు. "ఆంధ్ర మహాభారతము-అలంకారసమీక్ష"ను శ్రీరావుగారు అనంతపురం పి. జి. సెంటర్ ద్వారా శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమునకు తెలుగులో డాక్టరేట్ పట్టా కోసం ఈ పరిశోధన గ్రంథాన్ని సమర్పించారు. వీరి గురువులు శ్రీ కోరాడ మహదేవశాస్త్రిగారు వీరికీ విషయమై కుతూహలము కలిగించిరి. వారి సలహా మేరకు రావుగారు "ప్రయోగ సౌందర్య సమీక్ష" చేయుటకు పరిమితము చేసుకొనిరి.

ఈ పరిశోధన వ్యాసము రెండు అధ్యాయములుగా విభజింపబడినది. అందులో మొదటి అధ్యాయమున అలంకారాన్ని కేంద్రబిందువుగా తీసుకొని సముచిత విషయ విస్తరం చేసుకొంటూ అలంకార ముఖ్య సిద్ధాంతాలనన్నింటిని కూలంకషంగా చర్చించిరి. "అలంకార ప్రశస్తి"లో వేద వేదాంగాలనుండి మంత్రాలను

ఉదాహరిస్తూ అలంకారం పుట్టు పూర్వోత్తరాలను శ్రీరావుగారు చక్కగా నిరూపించారు. ఇందు అలంకార స్థానాన్ని నిర్ధారించి, అలంకార శిల్పాన్ని విశ్లేషిస్తూ చేసిన సమీక్ష ఎంతో ప్రామాణికంగా లాక్షణిక హృదయావర్జకంగాను ఉన్నది.

కవిత్రయం ఏయే ప్రయోజనాన్ని అపేక్షించి ఎక్కడ ఏయే అలంకారాలను ఎలా ప్రయోగించారో, ఎలా పెంచారో కూడ స్పష్టం చేయబడింది. ఈ విధానాన్ని విశ్లేషించి చెప్పడం రావుగారి నిశిత పరీక్షకు నిదర్శనం. తిక్కన, ఎఱ్ఱాప్రెగడల అనువాద భాగాల్లోనుండి ప్రతి అలంకారానికి ఎన్నో ఉదాహరణలను ప్రదర్శించి, పరిశోధనను ఎంతో ప్రామాణికంగా శ్రీరావుగారు సాగించారు. ప్రధానాలంకారాలైన ఉపమ, రూపక, ఉత్ప్రేక్షలను మూలానువాద సాదృశ్య పరిశీలన పద్ధతిలో పరిశీలించి, ఇతర ముఖ్యాలంకారాలను ఎనభై మూడింటిని ఎంతో సంగ్రహంగా, సవిమర్శంగా, సముచితంగా ప్రతిపాదించిరి.

ఈ పరిశోధన వ్యాసము ఆంధ్ర మహాభారతముపై అలంకార సమీక్ష చేయడానికి వ్రాసిందైనా అలంకారంపై సంస్కృత లాక్షణికుల సిద్ధాంతాలకు కూడా ఒక చక్కని ఆదర్శంగా కనబడుతూంది. అలంకార స్వరూపాన్ని అవగాహన చేసుకోవాలను కొనే సహృదయులైన రసహృదయులకు ఈ గ్రంథము ఒక చక్కని కరదీపిక వంటిది. ప్రామాణికంగా ఔచిత్య భాసురంగా

ఇంత చక్కని పరిశోధన చేసి ఆంధ్ర సాహితీ లోకంపై తీరని ఋణభారాన్ని మోపారు డా॥ సత్తిరాజు లక్ష్మీనరసింహారావుగారు.

శ్రీ రావు పై ప్రామాణిక పరిశోధనా గ్రంథాన్నే కాక "భువనవిజయము", "మగువ మనసు" అనబడు కథల సంపుటిని రచించి ముద్రించిరి. కాలేజి విద్యార్థుల ప్రోత్సాహముతో వారి ప్రదర్శన నిమిత్తమై వీరు వ్రాసిన "భువనవిజయము" - అటు ప్రదర్శనకు-ఇటు చదువుటకు యోగ్యముగా నున్నది.

నరసింహారావు గారికి కథారచన చిన్నతనమునుండే అలవడినది. రానురాను వారి ఆసక్తి యినుమడించినది. తనతో బాటు ఉత్సాహవంతులైన నలుగురిని కథారచనలో సిద్ధహస్తులను చేయవలెననెడి సంకల్పము వారిది. అందుకే వుద్యోగ రీత్యా హిందూపురమునకు వచ్చి చేరిన నరసింహారావుగారు స్థానిక కథా రచయితల నందరినొక్క చోట చేర్చి వారిలోని సృజనాత్మక శక్తిని పెంపొందించుటలో కృషి సల్పి సత్ఫలితము పొందిరి. రావుగారిది కథారచనలో అందెవేసిన చేయి. వీరి అనేక కథలు సుప్రసిద్ధ తెలుగు వారపత్రిక లన్నింటిలో ప్రచురింపబడినవి.

వీరి "మగువ మనసు" సంపుటిలోని కథలన్నీ పుష్టిని, తుష్టిని కలిగి మనస్తత్వ పరిశీలనకు చోటివ్వబడినవి. వీరి కథల్లోని వర్ణనలు, అలంకారాలు చదువరి దృష్టికి వేగనిరోధకా

లభిపించినా, ఆ వర్ణనలు, అలంకారాలు అతన్ని కొంత తడవు ఆలోచింపచేస్తాయి. మగువమనసు కథలో "సంతానంలేని స్త్రీ లోపమంతా మగాడిదే నన్నట్లు సులభంగా తప్పుదార్లలో పడు తుంది. పరులకోసం ప్రాకులాడుతుంది" అన్న దురభిప్రాయాన్ని రచయిత ఇందులో కాదని పూర్ణమ్మ పాత్రచేత లోకానికి తెలియజేసారు.

"మంచిమనిషి" అనే మరో కథలో రైళ్ళల్లో అవి యివి ప్యాసింజర్లకు అమ్ముకొంటూ జీవించే ఓ వెండర్‌ను రచయిత- ఓ దొంగగా భావిస్తారు. అతడెంతటి కళాకారుడో? అతని సహృదయత ఎంతటిదో? అతడెంతటి హస్తకళానైపుణ్యం గల వాడో తుదకు తెలుసుకొని ఆనాటి రైలు ప్రయాణములోనే అతడు తన కుడిచేతిని పోగొట్టుకోవడం చూచిన తాను (రచ యిత) ఎంతగా కుమిలిపోయింది, చక్కగా చిత్రీకరించినట్లు కథను వ్రాసారు. వీరి ఈ కథల సంపుటి త్వరలోనే వెలువడు తున్నది.

శ్రీ నరసింహరావు మంచి రచయితలు, వక్తలేకాదు, కళాసాహిత్య సేవా సంస్థలందు కార్యకర్తలై బహుముఖ సేవ లందించిరి. ఇట్టి వీరికి భగవంతుడు ఆయురారోగ్య భాగ్యముల నిచ్చి సర్వదా కాపాడుగాక!





# శ్రీమతి

# జి. పి. నాగలక్ష్మమ్మ

జననము : 16-6-1928

తల్లి : పేట సుబ్బమ్మ

తండ్రి : శ్రీ పేట ఆదెప్ప

విద్య : S.S.L.C. వరకు చదివి, ఆయుర్వేద పరీక్ష లందు ఉత్తీర్ణురాలైనది.

ఆంధ్ర గీర్వాణ సాహిత్య పఠనము, ఆయుర్వేదశాస్త్ర విషయములు ఈవిడ అభిరుచులు. ఆర్ష సంస్కృతి; స్త్రీలు నాడు - నేడు; గృహ వైద్యసంగ్రహము మొదలగునవి వీరి రచనలు. ఈమె తిరుమలగిరివాసుని నిట్లు ప్రార్థించినది.

తిరుమల గిరివాసా-శ్రీ వేంకటేశా; సిరిగల దైవమా
శ్రీ శ్రీనివాసా!
కలియుగదైవమై నీవు వెలసినావు వెంకటగిరిని
కోరినవారికి కొంగుబంగారమై వెలసితివీ
నిఖిల జగమ్మేలు దేవాదిదేవుడవు-సకల సృష్టినీ చల్లగ
బ్రోచే కరుణామయుడవు!

హిందూపురమునకు చేరువగావున్న పరిగి మండల కేంద్ర మున ప్రస్తుతము నివసించుచున్నారు. వీరిని సర్వేశ్వరుడు రక్షించుగాత!

# "లహరి"

## క్రౌన్ సైజులో వెలువడుతున్న త్రైమాసపత్రిక

### పత్రిక మాత్రమే కాదు —
### ఇదొక అపురూప గ్రంథ సంచయము.

మీచే ఎన్నిక చేయబడిన తెనుగు సాహిత్యం లోని అలభ్య, అపురూప గ్రంథాలు ధారావాహికగా ఇందు ముద్రింపబడతాయి. వీటిని పాఠకులు సులువుగా పత్రికనుండి విడగొట్టుకొని బైండు చేయించుకొని భద్రంగా దాచుకోవడానికి అనువుగా ముద్రింపబడుతూంది

ఆధునిక నవల-కథారచయిత(త్రు)ల రచనలు కూడ ఇందులో వుంటాయి. ప్రతిసంచికలో ఓమంచి నవల ఉంటుంది.

వీటితో బాటు

సాహిత్యచర్చలు-కవిజీవితచరిత్రలు-కొత్తపుస్తకాలు కొత్తకలాలు - మొదలైన ఉత్సాహకర శీర్షికలతో

**ప్రభవ ఉగాదికి తొలిసంచిక వెలువడును**

ప్రతి సంచిక 200 పుటలు - వెల రూ. **15-00**

సంవత్సర చందా ఒక్కసారి చెల్లిస్తే రూ. **50/-**

కాగితం - ముద్రణ - తదితర ధరలన్నీ ఆకాశాన్ని అంటుతున్న ఈరోజుల్లో విలువైన సాహిత్యాన్ని -అపురూప గ్రంథ సంచయాన్ని అందించే వెలకు తగిన విలువైన పత్రిక "లహరి".

మీరు కలకాలం మీ ఇంట్లో ఉంచుకోవాలనుకొంటున్న అనర్ఘరత్న గ్రంథాలను - విషయాలను మాకు తెలియ జేయండి. పత్రికను ఏలాంటి విషయాలతో తీర్చితే, శాశ్వతకీర్తి నార్జిస్తుందో తెలియజేయండి.

మీరు మీతోబాటు పదిమందిని సంవత్సర చందా దారులుగా చేర్చండి. గ్రంథ సంచయాన్ని పెంచుకోండి.

## 55 ఏండ్లనుండి

సాహిత్య కృషి గావిస్తున్న "శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల" హిందూపురం-2 వారి వినూత్న పథకమిది.

## ప్రభవ నుండి "లహరి"
## వస్తుంది - తెస్తుంది
## పత్రికారంగంలో నూత్న ఒరవడి.

వివరములకు వెంటనే వ్రాయండి.

సెక్రెటరీ,

హిందూపురం
31-7-1986

శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల,
హిందూపురం-2

ESTD. 1918 Phone: 165

# హిందూపురం

# మ్యూచియల్ బెనిఫిట్ పర్మనెంట్ ఫండ్ లి.

హిందూపురం - 515 201 - (ఠి. 30)

పై సంస్థలో పొదుపు ఉద్యమము క్రింద 10, 15, 25 వేల చీటీలు నడుపబడుచున్నవి. షేరు హోల్డరులైన చిన్న వ్యాపారస్థుల వ్యాపారాభివృద్ధికిగాను తక్కువ వడ్డి రేట్లతో ఋణములు ఇవ్వబడును.

వడ్డిరేట్లు :- నెలకంతు-నూటికి నెలకు-రూ. 1-10

స్పెషల్- 90 రోజులకు-రూ. 1-25

జనతా-రూ. 1000లకు 100 దినములకు-రూ. 40-00

—: బోర్డు ఆఫ్ డైరెక్టర్స్ :—

1) శ్రీ యం. వి. వి. చలం — ప్రెసిడెంట్
2) శ్రీ రాజాకృష్ణయ్యశ్రేష్ఠి — సెక్రెటరి
3) శ్రీ జయం సత్యనారాయణయ్య — డైరెక్టర్
4) శ్రీ గౌరా లక్ష్మీనారాయణ — ,,
5) శ్రీ యం. వి. భద్రయ్య — ,,
6) శ్రీ కె. ఆనందయ్య — ,,
7) శ్రీ ఎన్. ఎ. చంద్రగుప్త — ,,
8) శ్రీ నంబూరి శంకరనారాయణ — ,,
9) శ్రీ కె. కె. రామలింగయ్య — ,,

(Sd.) బోర్డు ఆఫ్ డైరెక్టర్స్.